# చంద్రిక

## (పెద్దకథ)



ర చ న :

బుద్ధవరపు వేంకటరత్నం



జాగృతి
ప్రచురణ

మన్మథ వైశాఖము] [వెల: రూపాయి.

# మనవి



భారతజాతీయ జీవనదృశ్యంలో పల్లెటూళ్ళు ఒక ప్రత్యేక ఆకర్షణ. అందులో తెలుగువెలుగు మరీని.

మన గ్రామీణులు, వారికష్టసుఖాలు, ఖేదమోదాలు ఎట్టి వారినైనా కదలించకమానవు. వారిమధ్యనే మసులుతూ వారి సుఖదుఃఖాలలో భాగస్వామి కాలేని సహృదయు డుండడు.

పల్లెజీవనంవల్ల నామదిలో కలిగిన కదలికను, తద్వారా నేను పొందిన ఉద్వేగాన్ని, యథాతథంగా చిత్రించ డానికై చేసిన ప్రయత్నమే కథలుగా రూపొందింది

అయితే నాకృషి ఎంతవరకు సఫలమైందో నిర్ణ యించవలసింది పాఠకులే గనుక దాన్ని వారికే వదిలేసి నే శలవు తీసుకుంటాను.

— రచయిత

శ్రావణమాసమే, అయితేనేం – కఱవు సంవత్సరం. కావడంవల్ల వర్షాలు బొత్తిగా కురవడం మానివేశాయి. అందునా చాగలినాటిపై మఱీని – శీతకన్నేశాయి. తొలకరిలో మాత్రం తరచుతరచు పరామర్శించిన చినుకులకు మెరకపైర్లు మొలకెత్తాయి. మాది కేవలం మెట్టప్రాంతం. చెరువులలో నీరు లేనందువల్ల ఊడుపులు పడలేదు. రేవడిలోవున్న పైరులు కొద్ది, జలంకోఅకై నాలుకలు చాచే బాలబుడమ మొక్కలు; బిడ్డలను ప్రక్క-ప్రక్కల యీనలేక ప్రసవవేదన పడుతున్న బాలెంత వేరుశెనగలు; జవజవలాడుతున్న కంది ఊచలు. శ్రావణమేఘాలు రానూవస్తున్నాయి; వూళ్లలో, మావీధులలో, తోపుల పై, బీళ్ళవెంట విహారమూ జరుపుతున్నాయి బహుషోకుగా – నగరాలలో పార్కులలో శీతాకోకచిలుకలవలె వాహ్యాళిజరిపే పెద్దయింటిబిడ్డలు పదేపదే తమ్ము జాలిగాచూచే, దీనంగా యాచించే బీదబిచ్చగాండ్రను వికటంగా తిలకించి పెదవులు విరుస్తున్నట్లు మసలిపోతున్నాయి నభోమండలంలో. క్షమా స్వరూపిణి భూదేవి నెరియలుబారి, దీనులవలె మొగాలు వేలవేసుకున్న పాలిపోయిన పైరులతో పాంథులకు హృదయాలను ద్రవింప చేస్తోంది

పంటలు వెనుకపడడంతో అలగాజనంలో ఆకలికి కలకలం చెలరేగింది. వాళ్లు అసలే దాపరికమెఱుగని పేదజీవులు. ఏ పూటకు రెక్కాడితే ఆ పూటకే డొక్కాడుతుంది. ఆకలి

మంటలకాగలేక తెచ్చి ఫూరిమీద విరుచుకుపడతారేమో అని అట్టుడికినట్లు గుబగుబ లాడుతోంది ప్రజ. ఎవరిమటుకు వారే గింజలున్న మారాజులు జాగ్రత్త పడుతున్నారు. పట్నంలో చదువుకుంటున్న నాకు చెల్లాయి ఎప్పటికప్పుడు ఉత్తరాలలో ఊళ్లో జరిగే సంగతులు వ్రాస్తూనే వుంది.

శనివారంనాడు శెలవు. ఇంటికి బయలుదేరాను. కారు దిగీ దిగడంతోనే బక్కచిక్కిన కన్నతల్లివలె మా భూమి నన్నాహ్వానించింది వెలవెల బోయిన విన్నవదనంతో. చెల్లాయి లేఖలలో వర్ణించిన విషాదఘట్టాలు కళ్లయెదుట నృత్యంచేస్తున్నాయి. దారిలో నాకెదురైన కొన్ని అపరిచిత ముఖాలు వారు పొందే ఆకలిబాధను చూచాయగా చూపులతో వ్యక్తపరిచాయి.

గడపమీద అడుగుపెట్టేసరికి ప్రొద్దుపోయింది. భోజనం చేసి పిచ్చాపాటీ చెప్పుకున్నాం. పట్నంవాక ప్రపంచం. అక్కడ నాకు కఱవే అగుపడదు. కానీ ఇక్కడో-తిండి అనేది కానరాదు. సశ్యశ్యామలమైన భారతవర్షంలోగూడా ఆకలి చావుల మాటవింటే ఎంతటిగుండెమైనా బ్రద్దలవదూ? ప్రసంగవశంగా అక్కయ్యా, చెల్లాయీ వివరించే ఇతివృత్తాలను వింటూ విస్తుపోతున్నాను. ఇంతలో వీధిలో ఏదో అల జడి బయలుదేరింది. ఉత్సాహంగా నిరుపేద జీవులకథలను ఆలకించెడి నేను ఉలిక్కిపడి బయటకు వచ్చాను. రైతులు కొందరు తొట్రుపడుతూ ఏదో గొణుక్కుంటూ ఇటు అటు పరుగెడుతున్నారు. కొంపదీసి అగ్నిప్రమాదమేదైనా సంభ

వింపలేదు గదా అని హడలిపోయాను. త్రాగడానికి నీరైనా లేని వర్షాకాలపు వేసవిలో గుడిసెలు అతుకడ్డాయా ఆర్పడం సున్నే. గుడ్లప్పగించి "ఆరగించు నాయనా!" అని హుతా శనుడికి హారతిబట్టాలి. వగరుప్తో డొంకుదీసే ఒక యువకుని నిలవదీశాను. రెట్టించి అడిగాను. రోజుకుంటూ నెమ్మదిగానే "దొంగలు! దొంగలు!!" అన్నాడు. రెండే రెండు మాటలు. చెల్లాయిని తలుపుజాగ్రత్తగా వేసుకొమ్మని బయలు దేరాను జనంతో.

కలకలం అస్పష్టంగా నాకు అప్పటిస్థితిని విప్పి చెప్ప డానికి విసుక్కుంటూంది. పొలాలలోపికి కుప్పలుకుప్ప లుగా ప్రోగుచేసిన వేరు శెనగకాయను దొంగిలించడానికి మాలపల్లెలోని కొందరు లేచివెళ్ళారట. సంజకడనే ఆచూకీ తీసి వాళ్ళను యిల్లు కదలనిచ్చి కాపులు బయలుదేరారు వన వేసి పట్టుకోవడానికి. "ఎవ్వరికీ తెలియనివ్వకు" అంటూ ప్రతి చెవిలోనూ ఊదబడిన చిదంబర రహస్యం గ్రామాన్నంతనూ రెక్కోలిపింది చేలవైపు. ఊరిబయట, నాలుగు పొలిమేరలను తాకడానికి ఎగబ్రాకే పుంత మొగలను కాపలా కాశారు జట్లుజట్లుగా. సద్దుచేయకుండా దొంగలను పట్టుకోవడానికి ఎదురుచూస్తున్నారు. సంజచీకటి ముందంజవేసి చోరులనే ముందంజవేయించింది. చిత్రమైన వ్యూహంలో చిక్కుకున్నా మని తెలీకుండానే చిరునవ్వులతో మొయ్యగలిగినంతకాయ మోపులుగట్టి మళ్ళుమొగం పట్టారు.

క్షణంలో హఠాత్తుగా చీకటిలో ప్రతిధ్వనించింది. హుషారు. "అడుగో వాడే-పట్టుకో-ఊఁ" ఇవే చెదురుగా బెదురుగా వినవస్తున్నాయి. త్రుటిలో ప్రజ వికావికలై పోయింది. నాకూ ఆవేశం అధికమయింది. ఒళ్లు మఱచి ముందుకు సాగాను అంగలేసుకుంటూ. పదిబారలు నడచానో లేదో చీకటిలో ఏదో నాకెదురువస్తున్నట్లు తోచింది. గుబురైన చింతమొక్క ముందుకు అడుగులేస్తున్నట్లుంది. "ఎవరు" అని గర్జించాను గుండె దిక్కబట్టుకుని. వెంటనే ఆ స్వరూపం వెనుకకు మళ్లినట్లు ఆచలనం బలంగా సూచించింది. క్రమంగా దూరమౌతోంది. చేతనున్న టార్చిలైటుమీద నొక్కాను. అప్పటికే ఆకారం నూరుగజాలలో ఆనింది. తప్పకుండా దొంగఅనే నిశ్చయించుకున్నా. ఎలాగైనా పట్టితీరాలని సత్తువకొలది పరుగు మొదలుపెట్టాను. బరువుతోవున్న ఆవ్యక్తి దూరాన్ని మాత్రం తగ్గించకుండా పోతున్నట్లు వైఖరి స్పష్టపరచింది.

పుంతవిడిచి అడ్డుదారిన పడ్డాను. కంచెలు, డొంకలు కందిచేలు - మొర్కపల్లం మిరపతోటలు - ఎగుడు దిగుళ్లు, పగుళ్లు దీసిన రేగడినేల కాళ్లక్రిందనుండి జరిగిపోతున్నాయి జరజరలాడుతూ. దాదాపు పొలిమేర సమీపించాను. రెండు మూడు మారులు బిగ్గరగా అరచాను. "ఆగూ! ఆగూ!" ఇంక ఆ ఆకృతి ముందుకు సాగలేకపోయింది. కానీ-ఆశ్చర్యం! నేను వెంటాడుతున్న వ్యక్తిలో హఠాత్తుగా నిశ్చేష్టత ప్రవేశించి వుండాలి! లేకుంటే అంతటి వేగంగా నన్ను లాక్కొచ్చి

అలా నిలబడి పోవడం తటస్థించదు. క్షణకాలం నిశ్శబ్దంగా వుండి తరుముకొచ్చే ఉత్సాహం విడిపోతున్న స్థితిలో లైటు వేశాను. కళ్లు జిగేల్ మన్నాయి. గమనం మందగించి నిలుచున్న ఎదుటివ్యక్తి వల్ల చేతులతో ఎత్తబడ్డమోపు కొంచెమించు నామీద పడేటట్లు విసరబడింది. రొట్ట గుబురుతో నాతలను కప్పేసి, కాయబలంతో మొగం మొత్తడానికే ఆపిరుపు వుద్దేశింపబడింది. కాని గురితప్పిపోయింది. నాగుండె కొట్టుకోనడం ఆగిపోయింది. భయంవల్ల కాదు. కళ్లెదుట పట్టుబడ్డట్లై దీవలె నిస్తేజమై నిలచివున్న ఒక స్త్రీమూర్తిని చూడడం చేత.

వెలుతురును చూడలేక ఆమె కళ్లు మూసుకుంది నేర స్తుడు పరుల ముఖం చూడనొల్లనిస్థితిని జ్ఞప్తికి తెస్తూ. "ఎవరు నీవు" దీపికను ఆర్పి ప్రశ్నించాను. "తెలియడంలేదు బాబూ! దొంగను. చూస్తారేం? పట్టుకోండి. పాపం! శ్రమపడి పరుగున తరుముకొచ్చారు" అన్నది. అప్పుడు జ్ఞప్తికి వచ్చాయి ముళ్లు విరిగిన అరికాళ్లూ, గీరుకుపోయిన మోకాలిపిక్కలూ, క్రొత్త మిరప ఆకుల ఘర్షణలో దురదెక్కిన పాదాలూ. ఈహడా వుడిలో జోళ్లు ఎక్కడ జారవిడిచానో!

"ఛీ! వెధవపని. ఇలాగ గడ్డిగరవడంకంటె దుక్కలాగున్నావు ఎక్కడే నాకూలీ, నాలీ జేసుకుని బ్రతగ్గూడదూ?" అనేకమంది బిచ్చగాళ్లను నేను యీసడించిన తుడుపుమాట ఆక్షణంలో అవకాశాన్ని పురస్కరించుకొని కొరడా దెబ్బలాగ బయటపడ్డది నా హృదయంనుండి. అలగాజనంబాపతే

అయినా కొద్దోగొప్పో సంస్కారమో, విద్యాసంపర్కమో కలిగివుండకపోతే ఆమె ఈసమాధానం ఇచ్చేదికాదు. "ఈ వూళ్ళో నేనా బాబూ! మారాజులు పనులెక్కువై పోయి చేసే వాళ్ళులేక తెగపీక్కుంటున్నారు? మీరు కొత్తకామోసు పల్లెకి." చెమటతుడుచుకుంటూ, ఆయాసంతో నిలబడలేక మోపుపై చదికిలబడింది. వయసుకు చిన్నదైనా పెద్ద ఆరిందాగా, పట్నంలోమసలి మాటలునేర్చిన పిల్లవలె కనుపించింది. "చాలు-చాలు. ఈపాటికినదు. ఇంక ఎన్నడూ ఇలాంటి నీచపు పనులు చెయ్యకు. ఆడదానివిగనుక సరిపోయింది. లేకుంటేనా, ఊళ్ళోకీడ్పించి తోక్కచీల్చి ఎండబెట్టించేవాణ్ణి" గదమాయిస్తున్న నన్ను లక్ష్యపెట్టకుండానే చివాలున మళ్ళిపోయింది. చీకటి పల్చబడి వెన్నెల వెలికివస్తోంది. ఆమెను మళ్ళీ పిలిచాను లైటువేసి. ముఖంలోవెలుగు స్ఫుటంగా పడింది. ఆమె ప్రయత్నంగా నాదెస చూడబోయినందువల్ల "పట్టుకపో ఆమోపు"అన్న నామాట వినకుండా విరసంగావెళ్ళింది.



# 2

ఆమెనుగురించి ఆలోచిస్తూ ఇంటిదారి పట్టాను. ముళ్ళవత్తిడివల్ల కాళ్లు యీడ్చుకుంటూ మోసుకొచ్చాయి దేహాన్ని. బయలుదేరినతావుకు చేరుకునే సరికి గంటపట్టింది. జనం పల్చబడివున్నారు. ఇద్దరు నావైపు టార్చిలైట్లు వేశారు. “అబ్బాయిగారు తప్పకుండా దొంగను పట్టుకుని వుండాలి” అన్నాడొక రైతు నవ్వుతూ. నేనేమీ సమాధానం చెప్పలేదు. ప్రశ్న వేశాడన్నమాటేగాని అతడుగూడా అంతగా సమాధానం కోసం పట్టించుకున్నట్లు తోచదు. కొంత హేళనగూడా వారికి నేనంటే- వాళ్ళలో వాళ్ళు పడే ఘర్షణనుబట్టి అందరూగూడా దొంగలను ఆనవాలు పట్టలేకుండా విడచినట్లు తెలిసింది. మొత్తం నలుగురినిమాత్రం వెంబడించారు. కాని దొంగలు తెలివిగా దగ్గరగావచ్చినట్లేవచ్చి ఎదుటివానితలపై వేరుశనగ మోపుమొత్తి వుడాయించారు. ఈప్రక్రియవిన్నాక నేనే కొంత నయం అనుకున్నాను. బహుశా దొంగలు వ్యూహించే ఈ పన్నాగం పన్నుకొని బయలుదేరారు చౌర్యానికి. ఒకళ్ళ కొకళ్ళు చెప్పుకొనే సంఘటనలనుబట్టి కనీసంవొకరైనా దొంగ ఫలానా అని నిర్దేశింపలేక పోయారని ధృవపడింది.

ఇంటికి రాగానే చెల్లాయీ, అక్కయ్యా ప్రశ్నలవర్షం కురిపించారు ఈ ఉదంతాన్నిగురించి. ముందు సాధారణంగా-

అయినా కొద్దోగొప్పో సంస్కారమో, విద్యాసంపర్కమో కలిగివుండకపోతే ఆమె ఈసమాధానం ఇచ్చేదికాదు. "ఈ వూళ్ళో నేనా బాబూ! మారాజులు పనులెక్కువై పోయి చేసే వాళ్ళులేక తెగపీక్కుంటున్నారు? మీరు కొత్తకామోసు పల్లెకి." చెమటతుడుచుకుంటూ, ఆయాసంతో నిలబడలేక మోపుపై చదికిలబడింది. వయసుకు చిన్నదైనా పెద్ద ఆరిందాగా, పట్నంలోమసలి మాటలునేర్చిన పిల్లవలె కనుపించింది. "చాలు-చాలు. ఈపాటికినడు. ఇంక ఎన్నడూ ఇలాంటి నీచపు పనులు చెయ్యకు. ఆడదానివిగనుక సరిపోయింది. లేకుంటేనా, ఊళ్ళోకీడ్చించి తొక్కచీల్చి ఎండబెట్టించేవాణ్ణి" గదమాయిస్తున్న నన్ను లక్ష్యపెట్టకుండానే చివాలున మళ్ళిపోయింది. చీకటి పల్చబడి వెన్నెల వెలికివస్తోంది. ఆమెను మళ్ళీ పిలిచాను లైటువేసి. ముఖంలోవెలుగు స్ఫుటంగా పడింది. ఆమె ప్రయత్నంగా నాదెస చూడబోయినందువల్ల "పట్టుకపో ఆమోపు"అన్న నామాట వినకుండా విరసంగావెళ్ళింది.



# 2

ఆమెనుగురించి ఆలోచిస్తూ ఇంటిదారి పట్టాను. ముళ్ళవత్తిడివల్ల కాళ్లు యీడ్చుకుంటూ మోసుకొచ్చాయి దేహాన్ని. బయలుదేరినతావుకు చేరుకునే సరికి గంటపట్టింది. జనం పల్చబడివున్నారు. ఇద్దరు నావైపు టార్చిలైట్లు వేశారు. “అబ్బాయిగారు తప్పకుండా దొంగను పట్టుకుని వుండాలి” అన్నాడొకరైతు నవ్వుతూ. నేనేమీ సమాధానం చెప్పలేదు. ప్రశ్న వేశాడన్నమాటేగాని అతడుగూడా అంతగా సమాధానం కోసం పట్టించుకున్నట్లు తోచదు. కొంత హేళనగూడా వారికి నేనంటే- వాళ్ళలోవాళ్ళు పడే ఘర్షణనుబట్టి అందరూగూడా దొంగలను ఆనవాలు పట్టలేకుండా విడచినట్లు తెలిసింది. మొత్తం నలుగురినిమాత్రం వెంబడించారు. కాని దొంగలు తెలివిగా దగ్గరగావచ్చినట్లేవచ్చి ఎదుటివానితలపై వేరుశనగ మోపుమొత్తి వుడాయించారు. ఈప్రక్రియవిన్నాక నేనే కొంత నయం అనుకున్నాను. బహుశా దొంగలు వూహించే ఈ పన్నాగం పన్నుకొని బయలుదేరారు చౌర్యానికి. ఒకళ్ళకొకళ్ళు చెప్పుకొనే సంఘటనలనుబట్టి, కనీసంవొకరైనా దొంగ ఫలానా అని నిర్దేశింపలేక పోయారని ధృవపడింది.

ఇంటికిరాగానే చెల్లాయీ, అక్కయ్యా ప్రశ్నలవర్షం కురిపించారు ఈ ఉదంతాన్నిగురించి. ముందు సాధారణంగా

వర్ణించి నాకెదురైన స్త్రీని గూర్చి వివరించాను. ఆడుది దొంగతనానికిబయలుదేరిందనగానే వాళ్లువిస్తుపోయారు. సంఘ టనను మహాఉత్సుకతతో వినడం మొదలుపెట్టారు. సగం చెబు తూండగా చెల్లాయి సీత అంది "ఒసే-అక్కయ్యా-శృంగారపు చంద్రిగాన గాదుగదా అది?" పేరు ఎందుకు అడుగకపోయానా అని నాలుకకఱచుకున్నాను. "ఎట్టిటి పెద్దపగడాల పేరుందా మెడలో?" ఆత్రుతతో అక్కయ్య అడగడం మొదలుపెట్టింది. నేనన్నాను "ఉంది." "నల్లసిద్దిలాగ వుంటుందిగాదూ?" "సిద్ది లాగ లేదుకానీ నాణ్యమైన నలుపు" "నువ్వు దాన్ని పట్టు కున్నావా?" ముట్టుకున్నా నేమో అనేసందిగ్ధావస్థనుండి వెలు వడ్డప్రశ్న. "పట్టుకోవడ మేమిటే? నన్నుపసికట్టి అదేనిలచిపోతే" "అయితే నిన్నుగుర్తుపట్టిందా?" "సిచాదస్తంగానీ నన్నెలాగ గుర్తిస్తుందే? ఎప్పుడైనా దానిమొహం నేనుగాని నాముఖం అదిగాని చూసుకుంటేగా?" "ఒకచేతికి ఇత్తడి మురుగు వుం టుందా?" "ఆఁ-ఆఁ-ఔనే-అయితే- చంద్రి-అదే" అన్నాను. ప్రశ్నల తొట్రుపాటు నిలచిపోయింది. అక్క చెల్లెండ్రిద్దరూ సాంతంవిన్నారు. "కలవురోజులురా. ఇలాగునేప్రాణాలుగ్గబట్టు కుని కాలంవెళ్ళబుచ్చుతున్నాం" అంది అక్కయ్య. నేనుఆలో చిస్తూ మంచంపై వొళ్ళు వాల్చాను.

నిద్రపోయే వుంటాననుకొని వాళ్ళు ప్రారంభించారు వ్యాఖ్యానం. "చూశావా సీతా-నాలుగురోజులు తిండిలేక పోతే ఎలాగవుతుందో మనిషి పని" "నాలుగురోజులేంటే- వాళ్ళ యింట్లో పదినాళ్ళనుండి కుండ పొయ్యి కెక్కలేదు.

ఆమధ్య నువ్వు పోయిందని విచారించావే-అది దీని తల్లేనే" అంది చెల్లాయి. అక్కయ్యగొంతు బరువెక్కింది. "తల్లిలేని పిల్లల గతి చెప్పడానికేముంది! కుక్కనుగొట్టిన కర్రకంటె నీచంగా చూస్తారు వీళ్ళను. పాపం! ఒక్కగాని ఒక్క కూతురు. ఇన్నాళ్లు దీన్ని పొత్తిలిలో వుంచుకొని పెంచింది. పెళ్ళైనా చేయలేక పోయింది గదా. అయినవాళ్ళూ-కానివాళ్ళూ దీన్ని నానా వెటకారాలూ ఆడుతూంటే-ఓనాడు పంపీ ఒకనాడు పంపకా కూలికి జవసత్వాలున్నన్నాళ్ళు తానేవెళ్ళి, పరువు కోసం బరువుగా బ్రతుకులాగలేక ముద్దయిన గానుగెద్దులాగ కన్ను మూసింది. ఇంక ఆతండ్రి ప్రాణంమిగిలింది. వాడూ దగ్గుతో మంచం పట్టాడట." చెల్లాయి అడ్డువచ్చి "అలాంటప్పుడు మనిషి కేబుద్దేనా పుట్టిందీ అంటే పుట్టదూ? ఈకాపులు పనులు చెప్పరు – వెనకటివలె ధర్మంచేసే త్రాణా లేదు. మఱి చేసుకునేందుకుదొరక్క, అమ్ముకుంటే పుట్టక ఆకలితో మాడిచచ్చే వీళ్ళు దొంగతనానికి తెగించారంటే ఆశ్చర్యపడనక్కరలేదు. పట్టణంలో వుండడంవల్ల అన్నయ్య కిదేమీ వంటబట్టదు." అన్న సీతమాట వింటూన్న అక్కయ్యకు ఏదో సందేహం కలిగివుండాలి. నన్ను తట్టిలేపింది.

"ఒరే-చంద్రిని బాగా చితకగొట్టావేంరా దొరికింది గదా అని?" డగ్గుత్తికతో అడిగింది. వింతయైన ద్రుక్కులు ప్రసరిస్తూ ఆత్రుతతో నాకళ్ళలోకి చూసింది. "అబ్బే నేను మాత్రం మనిషినిగానుటే. మొగాడై వుండి ఎదురుతిరిగితే

ఏమోకానీ-ఆడుదాన్ని-కాగా చిన్నదాన్ని- కొడతానా? గదమాయించానంతే'' వాళ్లిద్దరూ తృప్తిచెందారు. స్త్రీజాతి-మీాదు మిక్కిలి చంద్రి జీవితంతో దగ్గర పరిచయం గలవారు. "పాపం! తినడానికిలేని ముండరా. మొన్నమధ్యాన్నం "కాస్త వాన్ని పొయ్యండమ్మా''అంటూ వాకిట్లో దడివార కూల బడితే గంజి గిన్నెలోపోసి రెండుమెతుకులేసి పొమ్మన్నాను. ఆ కాసిన్ని నీళ్ళకే దానిముఖం యింతయ్యింది''అంటూ చేతులతో చూపుతూ చంద్రిపట్ల తనకున్న జాలిని వెలిబుచ్చింది అక్కయ్య.

మెల్లగా నిద్రించారు వాళ్ళు. పట్నంజీవితాన్ని నెమరువేసుకోవడం ప్రారంభించాను అక్కయ్య అన్నమాటలతో పోల్చుకుంటూ. ఎన్నిసంస్థలు-ఎందరు యువకులు-ఎందరు సంస్కారులు! ఇట్టి అమాయకులకొఅకే దీక్షబూనినట్లు బల్లగుద్ది ఉపన్యాసాలు దంచుతున్నారు? ఒక్కపూట కాఫీలేకపోతే గిలగిల తన్నుకుంటారు. ప్రతివాడూ దీనజనోద్ధారకుడే. అక్కడ అందరు ఉద్ధారకులేగాని వాళ్ళుచేసేపనులుచూస్తే దీనజనులు వారికి అవుపిస్తున్నారా అనేసందేహం గలుగుతుంది. లేకపోతే వేలాదిసంస్కారులు, లక్షలాదినాయకులున్న మనదేశంలో ఎందుకు ఇందరు దీనాతి దీనంగా దిగజారుతున్నారు నీతిపథంనుండి? ప్రశ్నకు సమాధానం లభించదు నామేధస్సులో. నేనుగనుక సరిపోయిందిగాని మరొకడైతే చంద్రిని చావగొట్టియ్యుండేవాడు. వాడితర్కంలో అది తప్పుకాదు. క్షమాలేక [illegible]చచ్చినా వొప్పుకుంటుందికాని- వాడ్ని నిశిత హృదయుం

మనిషి నీతిమార్గాన్నిమాత్రం విడువగూడదంటుంది. 'అతడు మొరటు-జంతువు' అంటారు సంస్కర్తలూ, నాయకులూ. అసలు జంతువులెవరు? వీళ్ళా? వాడా?



# 3

పట్నంవెళ్ళాక చదువుధ్యాసలోపడి పల్లెటూరిమాట మఱచిపోయాను. పరీక్షలుకానిచ్చి యింటికివచ్చాను. ప్రసక్తాను ప్రసక్తంగా అక్కయ్యను అడిగాను వేరుశనక్కాయ దొంగలను గూర్చి. "ఆ మర్నాడే తేలిపోయింది దొంగలవైనం. ఆరాత్రే వొకజట్టు మాలపల్లికివెళ్ళి వాళ్ళందరినీ లేపి పేరు పేరునా పిలిచారు.దొంగలు నలుగురు. చంద్రి కనబడలేదు. మరునాటి రాత్రి వీధిలోనికి కబురంపారు వాళ్ళను రైతులు" "చంద్రి గూడా వుందని ఎలా తెలిసిందే?" ఆశ్చర్యంతో అక్కయ్యను పశ్నించాను. "నీకు తెలీదురా! ఊళ్ళో ముప్పాతికమువ్వీసమం దికి అదంటే కన్నెర్ర. సన్నకారు రైతులకూ, కుర్రకుంకలకూ మరీనీ— ఏఁవిటీ రౌడీవెధవలకి? పెద్దవాళ్ళే గడ్డికరుస్తూ వుంటే ఇంక వీళ్ళమాట చెప్పాలా? ఎలాగైనా రచ్చకీడుద్దా మని కచ్చబిగించి దాన్నికూడా దొంగక్రింద జమకట్టారు." "రచ్చకు లాగారా?" "ఆఁ" "చంద్రి ఏమన్నదే?" "ఏమం టుందీ? నీవు రాత్రే చెప్పివుంటావని హడలిపోయింది. దొంగ

తనం వొప్పేసుకుంది." ఇది వింటూన్న నాగుండె తరుక్కు పోయింది. "తర్వాత?" "తర్వాతనా—ఒక్కొక్కరికి పదేసి చొప్పున జరిమానా విధించారు. రమ్మనగానే తక్షణం రాకుండా బిర్రుచూపిందని దానికి ముప్పై వడ్డించారు." "ఏమిటే–చంద్రికి - ముప్పైరూపాయలు అపరాధమే!" అన్నానుఅదరిపోతున్నకంఠంతో. "ఇవ్వగలిగిందా?" అక్కయ్య బరువుగా ఇలా సమాధానమిచ్చి ఆగిపోయింది. "అదెక్కడివ్వగలదురా? 'సరేలెండి' అని వొప్పుకుని నాలుగురోజులు గడువు ఇమ్మని మూడోనాడు వేకువజామునే ఎక్కడకో వెళ్ళిపోయింది. తండ్రిప్రాణం దానికోసం ప్రాకులాడుతోంది. మిగత నలుగురూ కొంతపేచీపెట్టారు. వారి కుటుంబాలనూ, బంధువులనూ కేటాయించారు. తల తాకట్టుపెట్టి వారంరోజుల్లో జరిమానాలు చెల్లించి మరీ పనులకు మళ్లారు." చంద్రి వెళ్లిపోయిందన్న తర్వాతివృత్తాంతం నేనంత పట్టింపుగా వినలేకపోయాను.

చంద్రి ఒకవిచిత్రవ్యక్తిగా నామేధస్సులో ఇరుక్కుంది. దొంగతనం చేశానన్న అభిమానమూ; సొమ్ము చెల్లించలేననే భయమూ; వూళ్లో మళ్లీ తలెత్తుకు తిరుగలేనని దిగులూ; పనులేవీ లేవనే నిరాశా; లేక గ్రామంలో నిశ్చింతగా బ్రతికే ఆస్కారం లేకపోవటమూ; ఏ భావం ఆమెను రోగపీడితుడైన తండ్రినుండికూడా దూరంచేసింది? నాలో ఈ ప్రశ్న తెగడంలేదు. తొలినాటిరాత్రే చంద్రి నాలో దేన్నో లాక్కోవడానికి మూగగా ఆమెకు తెలీకుండా ప్రయత్నిం

చింది. కాని నేనే ధైర్యంతో నామనస్సును నిలవద్రొక్కు-కున్నాను.

చంద్రి చెప్పుకోదగ్గ రూపసికాదు. అలాగని అనాకారీ గాదు. నల్లగావుంటుంది. అయితే నల్లని వస్తువులు ఎన్ని మన దృష్టిని ఆకర్షించడంలేదు? "నల్లగుంటే దోసమేమిూ సల్ల గుంటే సాలదా?" అన్నాడు మిత్రుడొకడు వెనుక. ఏదో శక్తి నన్ను ఆమెనుగూర్చి విపులంగా ఆలోచించడానికి బలంగా పురికొల్పుతోంది.

మర్నాడు ప్రొద్దుటనే సీతచెప్పింది "అన్నయ్యా! నీవు వెళ్లిననాటినుండి రెండురోజులు చంద్రి మన యింటికి వస్తూనేవుంది. నీవు ఉన్నావా లేవా అని ప్రశ్నించి లేవని ధృవపరచుకున్నాక "నాకేదేనా పనిప్పించండమ్మా! వాకిలి వూడుస్తాను. పేడచేయగలను. పై పనులన్నీ చేస్తానమ్మా! ముక్కూ మూలుగూ లేనిదాన్ని. పెద్దపెద్ద మారాజులుకూడా వెక్కిరిస్తున్నారు "దుక్కలాగున్నావు! కూలీనాలీ చేసుకు బతగ్గూడదూ!" అంటూ. రోజుకు నాక్కాస్త - ముసలోడికి కాస్తాగంజిపోయించండి చాలు"అంది. "పోనీ మిూరేదైనా పనిచెప్పలేకపోయూరా?" దుఃఖంతో చెమ్మగిల్లడానికి తడ బడుతున్న కళ్లు కనబడనీకుండా ప్రశ్నించాను. "పోనీ రేపటి నుండిరావే" అంది అక్కయ్య. ఆ మాటకు ముఖం చేటంత చేసుకుని నవ్వుతూ మళ్లినట్లే వెళ్లి మళ్లీ అంతలోనే వచ్చి "మందిమరుపు ముంచిసండి. రేతిరిబూబుగారి చెప్పులు పడి పోయినట్టుండాయి. గరువులోవొకటి, కంచెకాడ వొకటీ

దొరికాయండి. అసలేదొంగదాన్నని ఊరంతా కోడై కూసింది. మాతల్లీ! పుట్టాక పూచికపుల్లైయినా ఎత్తుకెళ్లి యెరుగనండి. జాగ్రత్తండి – అయ్యగారివి ఖరీదైనజోళ్లు'' అని మరీ మరీ చెప్పింది'' అంటూామండువాలోవున్న చెప్పులుచూపించిందిసీత.

ఆ మరునాడే చంద్రి వూరువిడచి వెళ్లిపోయింది. సీతతో మాట్లాడినప్పటి చంద్రి; మరునాడు నా చెప్పులు నాకివ్వడానికి బయలుదేరిన చంద్రి; నా మాటలు నాకు వప్ప చెప్పడానికి సాహసించిన చంద్రి – బహుముఖాలుగా నా హృదయమందిరపు కవాటాలను భేదించి శాశ్వతమైన తావు నేర్పరచుకోడానికి ప్రయత్నించింది. ఆయా అవస్థలలో ఆమె ముఖం ఎలాగ వెలిగివుంటుందో! ఆ రాత్రి వెన్నెలే నా విరిసిందిగాదు, దాని దరహాస వదనారవిందాన్ని తేరి పరికించడానికి. యోచించిన కొలది నాకిదే స్థిరపడింది. చంద్రి నాకు దూరంగావుంటూనే, కనుపించీ కనుపించకుండానే నా మనస్సుకు అతిసమీపంగా హత్తుకుపోయింది. నాకంటబడితే, మరునాడు నాతో చెల్లాయిదగ్గర అన్నట్లే మాట్లాడివుంటే, కనీసం నాటిరాత్రేనా కొన్ని ఘడియలు – అక్కర్లేదు కొన్ని లిప్తలు ఆమె నా యెదుట నన్ను చూస్తూ నిలిచివుంటే ఇంతటి స్నిగ్ధమైనముద్ర చంద్రి నాలో ముద్రించి వుండలేక పోయేది. మనం వీడలేని మనస్సులు, ప్రియతము లనుకొన్న వ్యక్తులు మనలను విడిచివుండటంలోనే, లీలగా మనదృష్టి పథంలో వుంటూనే మనను ఎక్కువగా ఆకర్షిస్తారు. నిత్యమూ ప్రేమిా ప్రేమికులు; తల్లీ పిల్లలు; ఆప్తబంధుమిత్రులు వొకరి

నౌకరు విచిత్రమగు విధిప్రేరిత సంఘటనలవల్ల వేరుచేయబడ కుండా నిరంతరం సౌఖ్యంతో ఒకేచోట పడివుంటే వారి మాట మనకెందుకూ? వారికథలు కలకాలం ఉండగలవా? ఇంతెందుకూ? వారి ఆనందానికీ తెట్టుతో చిల్లంగట్టిన తేనె పట్టులోని మధువుకూ వ్యత్యాసం ఏముందీ?



# 4

శెలవులలో రోజూ సాయంత్రం పొలాలమీదికి వ్యాహ్యాళికి వెళ్లుతూండేవాణ్ణి. మాలపల్లి మీదుగానే రేవటికి దగ్గరదారి. వస్తూ పోతూ వాళ్ల యోగక్షేమాలు కను క్కుంటూ వుంటాను. నన్ను చూడగానే పడుచులు లేచి నిలుచోవడం, మొగాళ్ళు మంచాలెత్తెయ్యడం, నవ్వుమొగా లతో చూడడం పరిపాటి అయిపోయింది. ఆవాళటి సంజవేళ నిద్రగన్నేరుచెట్టుక్రింద కుక్కినులకమంచాన్ని అంటిపెట్టు కునివున్న ఒక ముసలివాడు రావడంతోనే నన్నుచూసి "దం డాలుండి. కామందులొత్తోవుంటే కాలూచెయ్యీ పడిపోయి నోణ్ణి లెగలేనుండి మన్నించాలి" అనడం ప్రారంభించాడు. అమాయకత నామనస్సును దగ్గరగా తాకింది. "ఏంరా! అలా గున్నావ్?" అన్నాను.

"దగ్గుండి బాబూ! కుర్రది పోయినప్పటినుండీ కూడు లేదుండి. ఆపక్కింటోళ్ళు కాత్తగంజి దాగమనిపోత్తే కతుకు

తున్నానండి." "చంద్రి తండ్రివా?" అంతకన్న వాణ్ణి పరిచయం చేసుకునే అడ్డదారి అవుపించలేదు. ఒక్కసారి ప్రయత్న పురస్కృతంగా ఉబ్బినకళ్ళను ఎత్తిచూశాడు. లోతుకుపోయి హఠాత్తుగా పైకుబికిన గ్రుడ్లు. వాడే శృంగారపు వెంకడు. "మందు వేసుకోపడంలేదూ" "నాకు మందేటిదొరా–గంజి లేనోడికి మందులెందుకూ? కామందులు కాత్త కనికరించి మాలాంటోళ్ళకు గంజినీళ్ళయినా పోయించీ ఎత్తుచూడాలి" అంటూ వణకుతూన్న వాడి దీనత్వాన్ని చూచిన నాకు హృదయిఫలకంమీద నగరాలలో నభోవీధులను అంటుతూండే దివ్యసౌధాలలో వెండి పళ్ళెములలో తిన్నంతతిని వెక్కసమై కుక్కలకు పంచభక్ష్య పరమాన్నాలు పారబోసే బాబులు మెదిలారు. నిరుపేదలను గుత్తకుపుచ్చుకున్న పార్టీలు కళ్ళయెదుట తారాడాయి. ఈసంస్థలు చేస్తున్నంతటి ద్రోహం మరెక్కడా వుండదు. దరిద్ర నారాయణులను మనం పరిగణించకుండా ధనిక పిశాచానికీ, అదిచేసే కరాళకాళికా నృత్యానికీ అనుగులకు మడుగులొత్తుతున్నాం. ఇంతకంటె ఆత్మవంచన ఏంకావాలి?

నాకు పొలంలో తారసిల్లాడు బాల్యమిత్రుడు ప్రకాశ రావు. అతడూ నేనూ అయిదోతరగతివరకు ఒకేచోట చదువు కున్నాం బాల్యస్మృతులు ప్రస్తావించుకున్నాం కొంతసేపు. పూతమీదఉన్న మిరపతోటలూ, కందిచేలు, వొత్తుగాపెరిగి వూగిసలాడే జొన్నకర్రలూ "అలా ఎంతవరకు నిలుచుంటా రోయ్? ఇలారండి మాఛాయలను విశ్రమించండి" అంటున్నట్లు

సంధ్యారాగంలో చల్లగాలితో గిలిగింతలు పెడుతూ పిలి చాయి. నల్లని పట్టుపానుపు పరచింది మెత్తని రేవడిభూమి. "బాబూ! మీరూ బయలుదేరేరటగాదూ ఆవాళ దొంగలను బట్టుకోవడానికి?" ప్రారంభించాడు ప్రకాశరావు.

"ఔను" "మీకు ఎవరూ దొరక లేదూ?" "ఒక దొంగను చాలాదవ్వు వెంబడించాను. అయితే చీకటి, ముళ్లు, చేలు, నాకు క్రొత్త" ఎంతప్రయత్నించినా అబద్ధం అతుక బడలేదు. ఆడితే ఆడదే ఆడాలి అబద్ధం. అతడు అంతపట్టింపుగా నిలవదీయలేదు. తానుగూడా ఏదో చెప్పదలచుకొని మఱచి నట్లున్నాడు. ఎదుటివాడు ఒకసంగతి చెప్పడానికి బాధపడుతు న్నప్పుడు నీవుచెప్పేదానిలో నిజానిజాలుగానీ, నీవైఖరిగానీ పట్టించుకోడు. తనమెదడులో మెదులుతూ కుమ్మరిపురుగులా దొలిచివేస్తూ వెలికిరావడానికి విరగబడే ఆభావమే కళ్లుపొరలు క్రమ్మేటట్లు చేస్తుంది; చెవుడుగూడా తోడ్పడుతుంది ఆమై కానికి.

"ఆఁ— చెప్పడం మఱచాను. మర్నాటిరాత్రి పాపం! దిక్కుమాలిన చంద్రిని ఎంత యాతన బెట్టేరనుకున్నారు?" ప్రకాశరావు హృదయాన్ని పెకలించుకుని వెల్లునలా పైకు బికే ఉందంతంలోని చంద్రి చిత్రంగా నాలో ఆందోళన రేకెత్తించింది. అతని ఆవేదన కళ్లులేని పులి. నాసంఘర్షణ అనిర్వచనీయ సందిగ్ధావస్థ. "ఏంజరిగిందేమిటి" నన్ను పరికి స్తున్న మిత్రుని అడిగాను.

"జాగ్రత్తగా వినండి. భోజనాలయింతర్వాత రాత్రి రచ్చబండకు రమ్మని చంద్రికి కబురంపారు కాపులు. ఊరంతా చిన్నా పెద్దా మగపురుగన్నది ఇంటిదగ్గర దిగడితేఒట్టు. 'రమ్మనండ్రా' అనిపెద్దలు అన్నదేతడవు "చూడునాన్నా! దాన్ని సందిట బట్టుకువచ్చేస్తా" ననిఒకడు; "అమాంతంగా ఎత్తుకురానూ" అంటూవొకడు, చిన్నా పెద్దా తేడాలేకుండా బయలుదేరారు మాలపల్లికి. ఉచ్చనీచాలు లేవుగదా! మన పల్లెటూళ్లు మటీ తగలబడిపోయాయి" అంటూంటే నా ఆత్రుత ఆగలేదు. "కొంపదీసి దాన్నెవరూ చెయిచేసుకోలేదుగదా" అనే నన్ను ఆపి ప్రకాశరావు సాగించాడు. "ఈ వినాయకు లందరూ దానిముందునిలచి సిగ్గూ బిడియమూలేక పలకరించడం మొదలెట్టారు వెటకారంగా. చంద్రి మాలదయితే మాత్రం! మహాఖచ్చితమైన ఆడది. అగ్గితునక. వీధులలో వేలడమేగాని ఒక్కడూ దానిగడప త్రొక్కలేకపోయాడు. ఇంకా అలాంటి మంచివాళ్ళుండబట్టే లోకం మునిగిపోకుండా నిలిచిందనుకోండి. లేకపోతే అగ్గి అక్కరలేకుండా బుగ్గిఅయిపోయి వుండేది." ఘాటుగా వ్యాఖ్యానించే అతనికి హుషారు పుట్టించడానికి ఉపన్యాస జ్వాలాగ్రానికి ఆద్య ప్రోక్షణ ప్రాయంగా వుంటుందని "నీతిభ్రష్టులై ప్రజలు చెలరేగుతున్నారు గనుకనే కలువులూ, యుద్ధాలూ తగులడుతున్నాయి. ఉత్తమాయిల్లాలు కంట తడిబెడితే ఊళ్ళో యేడేళ్ళు కఱువు" అన్నాను. "నిజమేనండి. ముమ్మాటికీ నిజం 'మాబాబుకు గంజిపోసి వస్తా'నని తండ్రికి గంటిజావ దాగించి కోక సవరించుకుని

బయలుదేరింది. చంద్రి సాహసానికి మెచ్చుకోవాలి. సరాసరి బరిమీదికొచ్చే నాగుపాములాగునే రచ్చబండకి చేరింది. సాక్షాత్తు పడగెత్తిన నల్లత్రాచే. ధైర్యంగా ముందునిలిచింది కాపులకు.

"చంద్రీ! దొంగతనంచేశావా?" ముడిగా ప్రశ్నించాడు పెద్దకాపు. జనంలో సద్దుయేర్పడింది." చెబుతున్న ప్రకాశరావు నిశ్చేష్టుణ్ణై వింటున్న నన్నుచూసి విభ్రాంతుడయ్యాడు. చంద్రి గుండెనిబ్బరాన్నిగురించి తీగలు ప్రాకించుకుంటున్న ఊహాలత హఠాత్తుగానిలిచింది. "చంద్రిఏమన్నది" అన్నాను. "అదేచిత్రం. నిజంచెబుతున్నా మీతో-నాచెవుల్ని నేను నమ్మలేకపోయాను. చంద్రి దొంగతనంవొప్పుకుంది"అని ప్రశ్నార్థకంగా నాకళ్ళలోకి చూశాడు. "నిజంగా చంద్రిఆపని చేసిందంటే నమ్ముతారా?" నేను దీనికీ ఆశ్చర్యపడకపోవడం అతన్ని మఱింత చకితరపరచింది. "అబ్బే నమ్మను. కాని వొక్కొక్కప్పుడు మనంకలలోగూడా అనుకోనివి జరుగుతూంటాయి. ఒకమనిషి నడతనుబట్టి అతడిలా వుంటాడని భ్రమిస్తాం. అంతా నిజమే. నూరుమంచిపనులలో అణిగిపోయి దారుణమైన ఒక కృత్యం మనకు కనపడనే కనబడదు. అతన్ని గురించి మన సదభిప్రాయం అనే గ్రుడ్డితనంవల్ల మనమనస్సు దాన్ని పసికట్టలేదు. శుద్ధాత్ముడైతేమాత్రం అతనికి ఆదారుణం కుండెడు గంగగోవుపాలలో విదల్చబడిన ఒకేఒక్క విషబిందువు. మనిషే ఒక వింతజంతువు. చంద్రి విషయంలో ఇది కాకపోవచ్చు. పతివ్రత లనుకొనబడే నేటి వనితలు ఎంత

మందిలో కులటలులేరు? వాళ్ళే వాళ్ళను ప్రశ్నించుకోవాలి. పృథ్విలో నీకంటె నిన్నుచూడగల నేర్పరియైన ప్రాణి మరొకటిలేదు. నిన్నునీవు మోసగించుకోలేవు. 'దానికేం' అనుకుంటున్నావా? అంతకు అతీతమైన ఆత్మవంచనేలేదు." అంటూంటే "ఏదో వేదాంతం శలవిస్తున్నారు. చంద్రిఅలా ప్రవర్తిస్తుందని ఎవరూ అనుకోకూడదు." నేను స్వయంగా చూచినా చంద్రి దొంగకాదని నాకు ధృవపడింది. నాపరంగా చిన్న అక్కా చెల్లెళ్ళకు అది దొంగతనం కానేరదని తేలింది. ఇంక మూడోవాడికి తెలియడం అనవసరం అనుకున్నా. "చంద్రి ఒప్పుకునేసరికి జనంలో కలకలం బయలుదేరింది. 'నక్క నూతిలోపడడమే చాలుగా తలకొకరాయీ విసరడానికి!' ఒక కుర్రాడు టార్చిలైటు చంద్రి ముఖంలోకి సూటిగావేసి "చూడండ్రా ఆకళ్ళు! ఎలా ఉన్నాయో మిలమిల లాడుతూ" అసూయను వ్యక్తంచేసే భావం. మరొకరౌడీ దాని వక్షం మీదికి కాంతిని ప్రసరింపచేసి "దిబ్బకొక్కులాగ ఎలా నిలుచుందో - సిగ్గూ లజ్జాలేదు" అన్నాడు దృష్టి సాంతం ఆమె అవయవాలపై పే కామేచ్ఛతో వుంచి నీచంగా. ఇంకొక ప్రబుద్ధుడు "చూస్తారేరా - రెక్కలు విరచికట్టి ఆ బండిచక్రానికి కట్టెయ్యండి" వాడికి పరాయి వాడు ఆమెను బాధపెడుతూంటే చూడాలని సరదా"— ప్రకాశరావును నేను మధ్యలో ఆపి "ఇలా గనుకుంటున్నావు గాని, అంతా అలానే వుంటారా? నేరంచేశానని అంగీకరించింది గనుక తలొక కర్రా తీసివుంటారు" అన్నాను.

"అలాగే-అలాగే. మీరుగూడావుంటే వొకదెబ్బ వేద్దురేం? మంచీ, చెడ్డా; నీతీ, నియమం; ఆడా, మగా ఏం వుండక్కర్లేదూ? ఇంతమంది కోప్పడ్డంతోనే కాపులు వుండబట్టక "ముష్టి జరిమానా" అన్నారు. వాళ్ళుమాత్రం ఆలోచించొద్దూ? మూటాముల్లీ, ముంతా గిన్నీ అమ్మినా మూడు డబ్బులురాని చంద్రి ముష్టి ఎలా తెస్తుందీ?"

ప్రకాశరావువంటివారు గ్రామాలలో వున్నారు. ప్రయోజనం శూన్యం. ప్రవాహానికి ఎదురీదలేని నావికులు. కొండ విరుచుకు మీద బడుతూంటే ఎంత మెలకువగలిగిన వాడైతే మాత్రం ఏం జేస్తాడు? గ్రామంలో పెద్దలు, చదువుకున్నవారు జరిగించే వేలాది అన్యాయాలను తెలుసుకున్నవాడికి చెప్పగలిగే దమ్ములులేవు. చెప్పినా వినే నాధుడులేడు. ముష్కర మనేపొరగమ్మినకళ్లతో అన్యాయాన్ని న్యాయంగా చూపించి అసత్యం వికటాట్టహాసం చేస్తుంటే దానికట్టెదుటనే నిజాన్ని ఏడ్పిస్తున్నారు. సత్యం వాదించేమాట వీరు వినలేరు. కనలేరు. ఆలోచించలేరు. అబద్ధం ఏనాడో వాళ్ల శక్తుల్ని దోచేసుకుంది.



## 5

చాగలి నాటను చూడవలసిన తీర్థాలలో పేట తిర ణాల గొప్పది. ఆవూరు పెద్ద పేర్కొనదగ్గ పుణ్యక్షేత్రంకాదు. శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామివారి ఆలయంమాత్రం వుంది చిన్నది. షష్ఠికి మానాటి వాళ్ళంతా స్వామి దర్శనార్థం వెడ తారు. ఉదయంనుండి సాయంత్రంవరకు – స్నానాదులు, దర్శ నాలు, పూజలు, సమారాధనలు ఇతోధికంగా వుంటాయి. అక్కడి ప్రత్యేకత నాటిరాత్రి జరిగే ఉత్సవం, దానిలో బాణా సంచా కాలుపు. ఇసుకవేస్తే రాలకుండా జనంమూగుతారు మందుకాలుపు చూడ్డానికి. ప్రత్యేకంగా దీనికి ఏటా నాలుగువేల రూపాయలదాకా ఖర్చుపెడతారు. నేను ఎక్కడున్నా సుబ్బా రాయుడు షష్ఠికిమాత్రం కనీసం రాత్రివేళకైనా అక్కడికి చేరుకుంటాను.

మేం భోజనాలు ముగించుకుని ఎనిమిదింటికి బయలు దేరాం. పేట చేరుకునేసరికి తొమ్మిదయింది. దారిపొడుగునా పోటాపోటీని తగులుకొచ్చే సవారీబళ్ళ హుషారు, కుర్రకారు రైతుల అదలింపులు, కోడెదూడల హుటాహుటులు చురుకుగా సాగాయి. పొలిమేరలోకి అడుగు పెట్టేసరికి ఎక్కడచూసినా బళ్ళే, పొలాల నిండుగా విప్పేసి, మందుగుండుసామాను ప్రేలుడుకు హడలిపోకుండా ఎడ్లజతలను తలత్రాళ్ళతో పోలు గర్రలకు బిగించి కట్టేశారు. ఒక్కబండిదగ్గరైనా కాపలా

అన్నదిలేదు. తీర్థంచూడాలన్న ఉత్సాహంలో దొంగతనంమాట గూడా మరిచిపోవాలి అథవా ఎవరైనా ఆగుణమున్నవాడు బయలుదేరితే. పక్కలెగరేసుకుంటూకొన్ని, పారుతూకొన్ని, గుండె లవియించుకుని పరుగులెత్తుకొనివచ్చిన గిత్తలు తాపీగా పరకలు నములుతున్నాయి. పెందలకడనే బయలుదేరి నెమ్మదిగా చేరుకున్న పెద్దయెడ్లు సాఫీగా పడుకుని నెమరేసుకుంటు న్నాయి. మోటబళ్ళు, నాటుబళ్లు, గూడుబళ్లు, ఒంటెబళ్లు, సవారీబళ్ళు అన్నిబళ్ళే ఎటుచూచినా—

బండివిప్పిన మరుక్షణంలో దానిలోని వాళ్లందరూ వలదప్పించుకున్న పావురాలవలె త్రుటిలో మాయమై జన ప్రవాహంలో లీనమయ్యారు. నామటుక్కు నేను ఒంటిగాణ్ణై పోయాను. విలాయి కర్రబుడ్డి వెలుతురులలో క్రొత్తతాటియాకులపాకలలో దుకాణాలదగ్గరనుండి తీర్థంలో ప్రతివింతనుచూసుకుంటూ, గుంపులు గుంపులుగావున్న ప్రజను త్రోసుకుంటూ ముందుకు పోవడానికి ప్రయత్నించాను. అంతా జనమే — చాలామంది అలగాజనం. ఆడ, మగ క్రిందుమీాదు తెలీకుండా ఒకళ్లనొకరు ఒరుసుకుపోతున్నారు క్రొత్తగోదావరినీరువలె. జాతి, మత, వర్ణ, వర్గ వైషమ్యాలను మఱచిపోయిన మనుష్య సముదాయం. ఖర్జూరపుపండుముద్దవద్ద మూగి బేరాలలో కొసరుతున్న వనితలు కొందరూ, వాళ్ళచుట్టూ చేరి ఖాలికేక లేస్తూ కేరింతాలుకొట్టే యువకులు కొందరూ. కాఫీహోటళ్ల నిండా జనమే. రంకులరాట్నందగ్గర ఇరవైనాలుగు గంటలూ దొమ్మీ్మయే. మాతీర్థాలలో అదొక వినోదం, తెగయెగబడు

తారు రాట్నం ఎక్కడానికి. గిరిగిర తిరుగుతూంటే రంగురంగుల చీరకొంగుల హాొయల్లు, గిలిగింతలుపెట్టే కిలకిలనవ్వుల చిమ్మే తెలుగుపడుచుల సొబగులు, పూవులచుట్టూ తిరుగుతూ రొదచేసే గండు తుమ్మెదల రొదను జ్ఞప్తికితెచ్చే పురుష కంఠాల కలకలం – ఈ వినోదాన్ని చూచి విస్తుపోతూ విసుగు అనేది మఱిచిపోయి ఆరాత్రిలో దీన్ని చూపించే విలాయి కర్రలు నేత్ర కర్ణ పర్వంగా శోభిస్తాయి.

ఇంతలోనే వొక మూలనుండి తాళాలచప్పుడు "కాశీ పట్నం చూడరబాబూ! గంగానదినీ చూడరబాబూ" అంటూ బండి తోలుకొస్తాడు చలనచిత్రప్రదర్శకుడు. రోజూ సినీమాలు చూస్తూన్నా ఈ చిత్రానికి తీర్థాలలో గిరాకీని తగ్గించేరుగాదు మన తెలుగుప్రజ. గొంతు తంతులు బాగుగా సాగిపోయి వుండాలి చూపేవాడికి. తాళాలు మ్రోగిస్తూ ప్రదర్శిస్తూనే వుంటాడు వచ్చేపోయేవారికి తలకొక అర్థంచొప్పున పుచ్చుకుంటూ. డక్కీలు అమ్మేవాళ్లు, గాలిపూలవర్తకులు, పేలిపోయిన రబ్బరుబుడగల్ని లెక్కించకుండా కొత్త బెలూన్లు వింతవింత ఆకారాలలో ఊపిరికొద్దీ తెగపూరించేవాళ్లు అటూ యిటూ, రాత్రీ పగలూ తచ్చాడుతూనే వుంటారు. ఇంకొక ప్రక్క నంబరుగుండువాడు డబ్బా వాయిస్తూంటాడు. వాడికి పోటీగా ఎదురుగానే మూడుముక్కల ఆటవాడు సిద్ధం. "కాయ్ రాజా! కాయ్,కాయ్ 'లక్కీఛాన్స్' అంటూ చెవిగోసిన మేకలాగ అరుస్తూంటాడు.

మందుకాల్చే సమయం కావచ్చింది. జనంలో అల జడి అధికమైంది. నలుమూలలనుండి నిర్ణీత స్థలానికి చేరుకుంటున్నారు. నలుగురు దిండియాలవంటి కాకలు తీరిన రౌతులు కాలుస్తున్నారు. మొదట చువ్వలు ప్రారంభించారు. చివాలున అగ్నివిస్ఫులింగాలను వెదజల్లుకుంటూ నక్షత్ర మండలానికి హుటాహుటిని యెగబ్రాకి, అమాంతంగా గుండెలవియించే ధ్వనితో ఠపీమని పగిలిపోయి పువ్వులను రాలుస్తున్నాయి. ఓహో! ఏం పువ్వులు! రంగురంగులపూలు! ఒయ్యార మొలికించే ముత్యాలను సేసలుగా చల్లుతున్నాయి జనాళిపై. ప్రజావెల్లువనుండి హర్షం మిన్నుముట్టుతోంది. బయలుదేరే ప్రతి చువ్వా చివాలున పైకెగస్తూ తనతో మాధ్రుక్కులను లాక్కుంటూ, నవ్యసాహిత్యనభోమండలంలో కథానికావిస్ఫులింగంవలె వివిధవర్ణాల మనఃప్రకృతులను వింతవింతగా ఆకర్షిస్తూ, ప్రదర్శిస్తూ వెలుగుజాడలువెళ్ళబోస్తోంది. పువ్వులూ ముత్యాలేనా? రకరకాల బొట్లు-వాటిలో పవిషాడు యెలా పొదిగి కూర్చాడో- రంగురంగుల ముత్యాలతర్వాత బొమ్మలు బయలుదేరడం ఆకాల్పులలో ఇంకొక ప్రత్యేకత. చిమ్మచీకటి ఆవరించిన శూన్యాకాశంలో- వెలుగులుచల్లుతూ క్రిందికిజారే గొడుగులు. గొడుగులు వేసుకొని నృత్యంచేసే దొరలు, దొరసానులు- వీటికూర్పు ఆంధ్రులలో వొక తెగకు చెందిన వర్ణానికి పుట్టుకతో అబ్బిన కళ. పూర్వకాలంనుండి జమీందారులు పోషించేవారుదీన్ని. కాలగర్భంలోపడి ధూప, దీప, నైవేద్యాలు లేక మరి కానరాకుండా పోతోంది.

కాల్పులలో మార్పులుకొన్ని. గాలిబుట్టలు, కాగితపు మడతలో క్రొవ్వొత్తి వెలిగించి తమాషాగానిలబెట్టి పొగను పూరించి పెద్ద బెలూనును తయారుచేసి ఆకాశంలోకి వదిలి పెడితే తేలి యాడుతూ పోతుంది. ఈతచెట్లు, సుదర్శన చక్రాలు, బొబ్బిలికోట, లంకాపురి– బొబ్బిలికోటతో ప్రథమ ఘట్టం ఆఖరయ్యింది. జనంలో సర్దుమణిగింది. మళ్ళీ విడిపో తున్నారు. నేను యింకొకచోటికి దారితీస్తూంటే మావూరు నుండివచ్చిన హరిజనుడొకడు కనుపించాడు. కృపాదాసు అని పేరెట్టుకున్నాడు మతం మార్చుకుని. వాడిఅసలుపేరు వీరేసు. "బాబుగారు తమరుగూడా వచ్చారు తీర్థానికి" అన్నాడు. "ఔనురా" జేబులో చెయ్యిపెట్టి నాలుగణాలుతీసి వాడికిస్తూ "పిల్లలకు ఏమన్నా కొనిపట్టుకుపో" అంటూ "ఇంకా ఎవ రెవరు వచ్చారురా?" అని ప్రశ్నించాను.

కృపాదాసు వంగి నమస్కరిస్తూ ఆ డబ్బులు ఆప్యా యతతో అందుకున్నాడు. "మనూరువాళ్ళంతా వచ్చారండి. ప్రక్కవూళ్ళ వాళ్ళుగూడా, మనోళ్ళచుట్టాలు" అంటూంటే నాకు చంద్రి గుర్తుకు వచ్చి దానిమాట అడిగాను. "అదీ వచ్చిందండి. తండ్రిని వొదిలేసినకాడనుంచీ శింగారంలో దాని పాటు బాగానేవుందండి. పెళ్ళిచేసుకుందిగూడా" అంటు న్నాడు. "అహా–అలాగా? చంద్రి పెళ్ళిచేసుకున్నదీ? అయితే మళ్ళీ మనవూరు రాలేదేంరా?" నా ప్రశ్న. "మాటంటే తమరికి కోపమొస్తుందిగాని మనవూరిలో అంతా మర్యాద స్తులూ, పెద్దకాపులూ వుండగా చంద్రిలాంటిపోకిరీ ఎలా అడు

గెడుతుందండి ?" లౌక్యంగా హేళనగా నాలుగుముక్కలు మిషనరీబడిలో నేర్చుకున్న కృపాదాసువిమర్శ నాకు నవ్వు పుట్టించింది. నెమ్మదిగా వాణ్ణి జనంలోనుండి మళ్ళించి చెరువు గట్టువారనవున్న రావిచెట్టుక్రిందికి తీసుకెళ్ళి కూర్చోబెట్టి జరిగిన సంగతులు అడిగాను. ఊళ్ళో అఘాయిత్యాలూ, చంద్రిశీలానికి సంబంధించిన ఘట్టాలు విన వేడుకపుట్టింది. నా ఉత్సుకతను గ్రహించి కృపాదాసు నిర్భయంగా చెప్పసాగాడు.

"అయ్యా! తమబోంట్లనగా, పెద్దలనగా గొప్పవారి బిడ్డలుగనుక ఏంచేసినా చెల్లుతుంది. అదే మా అలగాజనం కానీయండి. దొడ్డికి మళ్ళించి రెక్కలు విరచికట్టి నేరంచేసినా చెయ్యకపోయినాసరే తొక్క చీలుస్తారు. మా మొరాలించే మారాజు వుండడు. సరిగదా – గొడ్డును మోదినట్లు బాదుతూంటే "అయ్యో" అనే అయ్యగారైనా కనబడరు. ఏపాపమూ యెరుగని చంద్రికి ముప్ఫైరూపాయలు జరిమానా! తాముసరాగాలకు రమ్మన్నాంగదా – రాలేదు, దీనికింత పొగరా? అని అబద్ధపుసాక్ష్యం యిచ్చినవాడి మాటల్లా నమ్మి వూళ్ళోపెద్దలు అది వూరువిడిచేటట్లు చేశారు. ఇది చాలా అన్యాయం" అన్నాడు రుద్ధకంఠంతో.

"కులం తక్కువైనా, కూలిమనిషైనా ఆడుదాన్ని– సిగ్గుతో చచ్చిపోయేదాన్ని – పెద్దకులాలవారు ఆలోచించక– అర్ధరాత్రివేళ నడివీధికి పిలిచి తగవు పరిష్కరిస్తామని దాన్ని బట్టుకు అటులాగి ఇటులాగి – ముఖంమీద, వొంటిమీద లైట్లేసి – పకపకలు వికవికలతో నగుబాటు పాలుచెయ్యడం

న్యాయమేనా?" అంటున్న కృపాదాసుతో "నిజమేరాఅబ్బీ! రోజులు ఏమీ బాగులేవు. పేదవానికి పెద్దలౌతున్నారు ప్రతి వాళ్ళూ" అని వోదార్పు బ్రయత్నిస్తూంటే "చాల్లెండి. మేమూ కొంచెం చీమూ నెత్తురూ వున్నవాళ్ళమే. మానాభిమానాలు మీకెంతో మాకూ అంతే. మీ వర్ణంలో ఎవరినైనా మఱొకరు కన్నెత్తి చూస్తే వూరుకుంటారా? చెప్పొచ్చుకు కొడ తారు. మరి మా ఆడాళ్ళు అలాకొడితే ఏమవుతుందీ? చేసింది తప్పుఅయినప్పుడు దెబ్బపడినందుకు పౌరుషం ఎందుకు రావా లండి? తగవునాడు చంద్రిని యీడ్చుకెడతానని బయలుదేరిన పెద్దమనిషి గౌరవం ఎంతవఱకూ నిలచింది దానిచేతిలో—" కృపాదాసుని ఆత్రుతతో ప్రశ్నించాను. "ఏం-ఏంజరిగిందే మిటీ?" "చాలా గ్రంథంవుందిలెండి. కావాలని రేవటికి కలుపుతీతకు తీసుకెళ్ళాడు తగుదునమ్మా కాపుదనానికని. ప్రొద్దోయిందాకా నడుములెత్తనీకండా పనిచేయించుకున్నాడు తనుయిచ్చే నాలుగేసిఅణాల డుబ్బులికి. 'చంటిపిల్లలు పాల కేడుస్తా' రని మాలముండలు గోలపెడితే సంజచీకటి సమీ పించేవేళకు మళ్ళించాడు. దారిలో చంద్రివెనుకనే బయలు దేరాడు వేళాకోళాలు మొదలేసి. దానికి వొళ్ళు రిమ్మెత్తింది. అసలే నల్లత్రాచులాంటిది. దానిమజా ఇంకా ఆబాబుకు రుచి తగల్లేదు. పొలాలుదాటి పుంతలో నడుస్తూ పరాకుగావున్నట్లు నటిస్తూ నెమ్మదిగా కాలితో దాని మెత్తని పాదం మట్టాడు. తోకత్రొక్కిన త్రాచువలె వెనక్కితిరిగి ఫెడీలుమని దవడ మీద ఒక్కటేసింది. కూలిజనం అప్పటికే చాలాదూర.

మయ్యారు. చెంపపెట్టుతో గూబ తడుముకుంటూ చారికలు గట్టిన బుగ్గలు నిమురుకుంటూ నిర్ఘాంతపోయాడు. వెంటనే ఉడాయించి వొక్క-గంతులో కంచెదూకి మాలపల్లిలో పడింది "నీకూలెంత నువ్వెంత పోరావెధవా"అనిచీవాట్లుపెట్టి. ఆనాటి నుండి కారాలు మిరియాలునూరుతున్న ఆసామీకి నాటికీ నేటికీ- ఆతగవునాడుదొరికింది అవకాశం. చంద్రిముఖంలోకి, రొమ్ముమీదికి లైటువేసి "చూడునాన్నా! ఆ సుందరాంగి ముఖారవిందం" అని ఎటకారంఆడాడుట పెద్దకాపుతో యీ చెంపపెట్టుతిన్న చిన్నకాపు. అది వొప్పేసుకుంది గనుక మేం చచ్చినట్లు కుక్కి-నపేలవలె ఊరుకోక తప్పిందికాదు. లేక పోతే ఈపాటికి యెన్నిగొడవలు జరిగిపోయేవో." కృపాదాసు తుదివాక్యం నన్ను మళ్ళీ ఆలోచనలోకి పడద్రోసింది. చంద్రి అమాయకత్వం నన్ను కోయడం మొదలుపెట్టింది గుండెలో. నేను దాన్ని వెంటాడకపోయినా బావుండేది. అంత గుండె నిబ్బరంగలచంద్రి "నేనేమీ ఎరగను" అంటే గొడవేవుండేది కాదు. అబ్బే- అదెలాకుదురుతుంది? అలగాజనంఅంతా ఒకటి; ఊరంతాఒకటి. నేను నిలవదీసి చివాట్లుపెట్టానుగా? అలాం టప్పుడు అబద్ధాలవల్ల దానిపై కోపం అధికంకావడమే జరుగు తుంది.ఇంతటి పౌరుషమూ, సౌశీల్యమూ నిండివున్న చంద్రిలో నిజాయితీగూడా పొందుపరచుకువుంటుంది. పూవునకు తావి అబ్బినట్లు.

"మరొకటి మనవిచేస్తా. గోపాల్పూరి అబ్బాయి వొకాయనట! ఎవరోగాని మహానుభావుడు. "సందిట బట్టు

కుని చంద్రిని వాటేసుకువస్తా'' నని లేచాడట. తర్వాత తెలిసింది ఆయనా బాగా తిన్నరకమేనని – గొడవకు నాలుగు రోజులక్రితమే సంజచీకటిలో అతగాడు మిరపతోటలోంచి యింటికి వస్తున్నాట్ట. చంద్రి బయటకువెళ్లి మళ్ళీ వస్తోంది. చీకటిగదా – చుట్టూ ఎవరూ లేరనుకుని, మాలపిల్ల, వొంటరి అనే లోకువతో, తానుచేసేది నీచపుపని, మూర్ఖత్వం, పశుత్వం, తుచ్ఛం, అని ఆలోచించక వెనుకపాటునే పిల్లిలాగ చప్పుడు చేయకుండావచ్చి, రెండుచేతులతోనూ అమాంతంగా చంద్రిని వీపుదగ్గరనుండి ఆనుకుని గట్టిగా పొదివి పట్టుకున్నాడు. గుండె ఝల్లుమంది కూలికూతురికి. రెండోదారి కనబడలేదు. "నాన్నగారూ – వొదులుండి, మీ పెద్దింటోరికిది మరియాదగాదు'' అని బ్రతిమాలింది. ఆపశువు వింటేగా? ఉచ్ఛనీచాలు తెలీని వాడు. ఏదో పేలడం మొదలెట్టాడు మైకంలో. ఆపిచ్చిని – మదోన్మాదాన్ని ఒదులుద్దామని చంద్రి తనచేతిలో దుక్కలాగవున్న పెద్ద ఇత్తడిచెంబును శక్తికొలది పైకెత్తి, రెండు చేతులతోనూ బలంగా పట్టుకుని వొక్కటే మొత్తు మొగం మీద మొత్తేసరికి, ఎదుటిమనిషికి కణతలు పగిలి కళ్లు చీకట్లు గమ్మి, చీకట్లో నడుం విరిగి చతికిలబడ్డాడు – ఆ అవమానంతో నిలువెల్లా మండిపోయి మూడురోజులదాకా నుదుటిమీద బొప్పివుంటే అడిగినవాళ్ళతో "చీకట్లో రేవట్లో తుమ్మచెట్టు తగిలింద''ని సాకు చెప్పుకున్నాడు. మేమూ నిజమేననుకున్నాం. నాలుగోనాటిరాత్రి మా పెద్దలదగ్గిర చంద్రి ఫిర్యాదుచేసే

దాకా. ఆపెద్దగారు వేరుశనక్కాయ దొంగిలించిందనిచంద్రిని వాటేసుకుని రచ్చకు లాక్కెడదామని బయలుదేరాడు.

ఇంతెందుకండీ – "రెక్కలువిరిచి బండికికట్టి వొళ్లు చీరండ్రా" అని ఆరాత్రి కసిదీరా బలికిన కాపుగారి చిన్న కొడుకు చంద్రి వెంటబడితేనే గాదండీ, గూడెంలో తురాయి చెట్టుకు రెక్కలు విరిచికట్టి చావగొట్టడానికి సిద్ధమాతా!ఆకాపు గారు అర్ధరాత్రివేళ మా పెద్దలను బ్రతిమాలుకుని, పాతిక రూపాయలు జరిమానా చెల్లించి 'రెండోకంటివాడికి తెలీసీకండిరా' అని కొడుకుని తీసుకెళ్ళాడు. ఆ డబ్బుతోనేగాదండీ రామకోవెలకు తలుపులూ, కమ్మిలూ కొన్నారు మాపెద్దలు!" అని కృపాదాసు చెబుతూంటే నాలో చంద్రి స్నిగ్ధంగా మెఱసింది.

లంకాపురి కాలుస్తారని గోల బయలుదేరింది. "పదండి బాబూ! చూడవలసిందిదే తీర్థంలో" అని హెచ్చరించి జనంలో లీనమయ్యాడు వాడు. నేను లేచాను. చంద్రి తీర్థంలోనే వుంది. ఎక్కడో! ఇప్పుడెలా వుంటుందో! చూడాలని బలంగా వుంది. కాని ఇన్నిముఖాలలో, వివిధ ప్రకృతులలో, వెలుగు నీడలలో చంద్రి వెలుగుజిలుగులు పసికట్టడం బహుకష్టం. ప్రతి ఆడుదీ చంద్రిలో కనుపిస్తుంది గాని, చంద్రి ప్రతి ఆడుదాని లోనూ అవుపడదు. మళ్ళీ జనంలో తోపిడి అధికమయింధి. అదే దొమ్మీ. గోదాలోనుండి హెచ్చరిస్తున్నారు జట్టీలు జనాన్ని దూరంగా పొమ్మని. ప్రమాదం సంభవిస్తుందన్న భయమేనా లేకుండా ప్రజ ముందుకు సాగిపోతోంది. చిచ్చు

బుడ్లు కాల్చి చేతితో పట్టుకుని, రవ్వలు మనుష్యులపై బడే టట్టు విరజిమ్ముతూ ఆ జనప్రవాహంలో లంకాపురికి నిప్పం టించడానికి చాలినంత తావు మాత్రం కలుగచేసుకున్నారు నలుగురు జోదులు. ఒకళ్ల నొకళ్లు బుజాలు నొక్కుకుంటూ కూర్చున్నవాళ్ళను నలిపివేస్తూ త్రొక్కిసలాడు తున్నారు ప్రజ.



# 6

నలుమూలలా కోట బురుజులవలె వున్న ప్రదేశాలకు అంటించబడింది అగ్ని. తొలుదొలుత ఇనుప రజను రవ్వలు ప్రారంభం. మనస్సునూ, హృదయాన్నీ నేత్రాలు తమ వైపు లాక్కుంటున్నాయి. వెంటనే బయలుదేరింది వెలుగు. కటికచీకటిని గాలించి వెలివేస్తున్న జిలుగు వెలుగు. అంతా కాంతే. నలుకెలంకులా నభోవీధికి ఎగ బ్రాకుతోంది. రాత్రి మరచిపోయింది. వొళ్లంతనూ గుల్లచేసి, కళ్లు సర్వావయ వావస్థలను మరపించి దేహాన్ని తమ వశంచేసుకుంటున్నాయి. ఒక్కొక్కప్పుడు వొక్కొక్క ఇంద్రియం పాలిస్తుంది మన శరీర సామ్రాజ్యాన్ని. ఆక్షణంలో అదినియంత. విచక్షణా జ్ఞానంవుండీ ఆపాలనలో మానవునకు ప్రయోజనం శూన్యం. ప్రజావెల్లువ కళ్లకు పండువై పోతున్న నిశిరాత్రిని చూస్తూ విస్తుపోతోంది. ఇంతలోనే ఇంకొక మార్పు. వెలుగు జరుగు తున్న కొలదీ తోరణాలుగా వ్రేలాడతీయబడ్డ బొట్లు ఒక్కొ-

క్క—టే పెటపెటలాడుతూ పగిలిపోతున్నాయి. హఠాత్తుగా నేత్రాలు మూతపడ్డాయి. ఒకరి ఆధిపత్యం పైన ఇంకొకరి దురాక్రమణ. శ్రవణేంద్రియం సవాలుచేసింది తన ప్రతిధ్వనులతో దద్దరిల్లుతూ. సుధ్య మధ్య కండ్లను మిరుమిట్లు గొలిపిస్తూ మానవులను చిత్రప్రతిమలుగా చేసి నిలుచో బెట్టింది. ప్రజలు ఊజగత్తులో వున్నట్లు తోచదు.

ఇలావున్న జనసముద్రంలోనుండి ఉబికిన బడబాగ్ని లాగ ఉత్పాతం ఏదో లేచింది. చెరువుగట్టుమీద చెట్టుకు కట్టబడివున్న కోడెదూడలజత తల్రతాళ్లు ప్రెంచుకుని నాలుగు కాళ్ళూయెత్తిపెట్టి సవారి చేసుకుంటూ జనంమీద పడింది. లంకాపురీదహనం తిలకిస్తున్న జనాళిలో విప్లవం చెలరేగింది. ఎవరిమటుకు వారు ప్రాణం రక్షించుకోవడానికి తానే ముందు వారిని ఇంకా ముందుకు నెట్టారు. అభినవ లంకాపురవాసులు లేకపోయారే అన్నకొరత తీరిపోయింది. కాలుతూన్న కోట మధ్యకు దూసుకుపోయింది కొండకొమ్మను మఱపిస్తూ వొక జనులకోన. ఒకదరినిబడి ఔట్లు ఫిరంగిధ్వనులతో పేలిపోతున్నాయి. చిటపటలతో మొదలై ఫెళ ఫెళార్భటులలోకి దిగింది జ్వాలాతోరణాల అగ్నికాంత. కొందరికి గాయాలు తగులుతూ వున్నాయి. మరికొందరికి వొళ్లు కాలిపోయింది.

ఇంతటి లంకాదహనమూ అంతటితో ఆరిపోయింది. క్షతగాత్రులు మినహా మిగాతామంది ఖాళీచేశారు రంగస్థలాన్ని. క్షణంలో నేనూ కొందరు మిత్రులూ వారినిసమీపించాం. ముగ్గురు స్త్రీలకు స్పృహలేదు. ఇద్దరు పురుషులకు చేతులూ

కాళ్ళూ కాలిపోయాయి. తెలివిరాని స్త్రీలలో వొకఆమెకు తలవెనుక ముచ్చెనగుంటలో పెద్ద దెబ్బతగిలింది. అక్కడ చేరినవారి సాయంతో అంటుకుని మండుతూన్న వారి గుడ్డల మీది జ్వాలలను ఆర్పి, ప్రథమ చికిత్సచేసి లోకలుఫండు ధర్మాసుపత్రికి చేరవేశాం. ఒక గంటసేపటికి వారిలో ఇరువురకు స్పృహ కలిగింది. మూడవ ఆమెకు మజ్జయందు బలంగా గాయంతగలడంవల్ల త్వరగా తెలివి రాలేదు.

నేనూ, డాక్టరూ ఉపచారాలుచేయడం ప్రారంభించాం. బట్టలు వొదులుచేసి, ముఖాన నీళ్లుచల్లి, ముంగురులు సవరిస్తూ ఆమె ప్రక్కనే రెండుగంటలసేపు కూర్చున్నాను. పాపం! ఎవరోగదా! తీర్థం చూడాలన్న సరదాతో బయలుదేరింది. విధి విధానంవల్ల యీ దుర్గతి పట్టింది. స్పృహవచ్చినా ఈమెను కోలుకోచెయ్యడం చాలారోజులవరకు జరుగదన్నాడు డాక్టరు. సుమారు మూడుగంటల వేళకు ఆమె లేచింది. మెడ మీదనుండి నుదుటిపైదాకా కళ్లనుగప్పి కట్టుగట్టాడు డాక్టరు. తెలివి రాగానే బాధతో ప్రక్కమీద పొర్లడం మొదలు పెట్టింది. ఆమెను ఆపుచెయ్యడం మా యిద్దరికీ శక్యంగాలేదు. గంటసేపు విలవిల దన్నుకున్న ఆప్రాణికి నిద్రపట్టడానికి ఇంజక్షను యిచ్చాడు డాక్టరు. నేను "ఎవరో అనాధవలె వున్నది. వీళ్లతాలూకువాళ్లు వచ్చేవరకూ భద్రంగా చూడండి" అని ఆయన దగ్గరశెలవుపుచ్చుకుని బయలుదేరాను.

నాకై మాపూరువాళ్లు బండి నిలుపుచేసుకుని వున్నారు. "మనం లంకాదహనం హడావుడిలో వున్నాం. ఈలోపున అగావుకి ఆగలేక గరువులో బళ్లయెడ్లన్నీ త్రాళ్లుతెంపుకుని గైరయిపోయాయి. వెదకివెదకి వీటిని పట్టుకునేసరికి మూతాతలు దిగొచ్చారు. రండిబాబూ! తెల్లవారిపోతూంది" అని ప్రకాశ రావు తొందరపెట్టి, నేను బండియెక్కి యెక్కడంతోనే గిత్త లను సవారీ చేయించడం మొదలుపెట్టాడు. తెల్లవారిపోయాము, అందులోనూ ఇంటికి మళ్లిపోతున్న కోడెలు, ఒళ్లుమఱచి ఉరుకు లేసుకుంటూ పరుగెడుతున్నాయి. బండి మైలుదూరం గడ చిందో లేదో ఎవరోవ్యక్తి రొజుకుంటూ మాకెదురయ్యాడు. మా బండిని ఆపమని మఱీ మఱీ కోరి ప్రశ్నించాడు "ఎక్కడ నుండిబాబూ! బండి?" "తీర్థంనుండి" మా సమాధానం. "ఆసుపత్రికి గానావెళ్లే రాండి మీలో ఎవరేనా?" రొప్పుతూ బయలుదేరింది ప్రశ్న. "ఆ. ఏం?" ప్రశ్నించాను బండిలో వెనుక కూర్చున్న నేను.

త్రుటిలో నాపాదాల చెంతకు వచ్చాడు. "మీ దేవూరు?" నాప్రశ్న. "సింగారం" ఆయాసంతోసిన సమా ధానం. "సింగారమా" ఆశ్చర్యంగా అడిగాను. "ఔనండి" "మఱిలా ఎక్కడికీ?" "మాఆడది తిరణాలకొచ్చిందండి. అగు పడ్డంలేదు, తమరు చూశారేమో" అమాయకపు హృదయం వొలకబొయ్యలేక బాధపడుతున్న ఆవేదన, దానికి నాలోజాలి. "మీ ఆడదెవర్రా?" "చంద్రిదొరా" ఆ సమాధానం విన్న నాస్వరం స్తంభించిపోయింది. "ఏంబాబూ! అలా నిలబడి.

పోయారు ? అక్కడ గానాలేదు గండాండి ?" మళ్ళీ అడిగాడు భావాల త్రొక్కిడిని అణుచుకుంటూ. "ఎలా వుంటుందిరా నీ పెళ్లాం?" "పొడుగాటి జడవుంది. నలుపుచాయ. కారునలుపు. చేతులకు ఇత్తడి గాజులున్నా యండి" రాత్రిపూట ఎవరేనా అతిసమీపానవుంటే తక్క ఈ గుర్తులు ఎలా పసికట్ట గలరూ? జడ నాకు బాగా గుర్తుంది. గాజులు కూడా సవరించాను. ఆమె క్రిందపడిపోవడంలో అవి చేతిని నొక్కేశాయి వంగి పోయి. "ఏం దొరగారూ" గొప్పుతూ అడిగాడు. "ఉందిరా" నామాట సగం వింటూనే ఉడాయించాడు వొక్క గంతులో మేం బండిలో త్వరత్వరగా తరిగేసుకు వచ్చిన దారిని మా వైపు తరిమేస్తూ. వాడికి పెళ్లాం అంటే ఎంత ప్రేమ! చంద్రి వంటి దానికి భర్తయైన ఈ దృఢకాయుడికి ఎంత దారేపణ! భార్యాభర్తల అన్యోన్యత యిట్టిదా! అనుకోసాగాను. పేద వాళ్ళకుకూడా భావాలు, ఉద్రేకాలు, హృదయాలు, కాంక్షలు, మానాభి మానాలు ఉంటాయి. ఉన్నవాళ్లు లేని వాళ్ళకు అవిలేనట్టుగానే ప్రవర్తిస్తారు.

"పోనీయనాండి బండి ? గిత్తలు ఆగడంలేదు. కాళ్ళు త్రొక్కుకుంటున్నాయి" ప్రకాశరావు అడిగాడు. "ఊఁ" అని "చంద్రి ఊళ్ళో లేదేమిటోయ్ ?" ప్రశ్నించాను బండిలోవాళ్ళ న్ను. "అప్పుడే పోయింది" అన్నారు కొందరు. ఒకవ్యక్తిమాత్రం "గుసిసేటిముండ – మందు కాలినట్లుంది.దీనితో చస్తుంది. మన వూరు వెలగబెట్టి, సింగారించుకోవడానికి సింగారంవెళ్లి కట్టు కుందో నల్లమొద్దుని గ్గానుగెద్దులా, తనచుట్టూ తిప్పుకుందా

మని ముద్దుగా" అంటూవుంటే అతన్ని కొర కొర చూచి "ఛీ! నోర్ముయ్" అన్నాను. అతడు చంద్రిచేతి చెంబు దెబ్బతిన్న గొప్పవారి అబ్బాయి.

ఇంటికి చేరుకుని మేను వాల్చాను మంచంపై. ఆనాటి ఘట్టమే నన్ను కలవరపెట్టింది. చంద్రి మళ్లీ నాయెదుట ప్రత్యక్షం. నాతో ఉద్యానవనంలో దాగుడుమూత లాడు తున్న కన్నెపడుచులాగ వుంది. మేఘమండలంలో ఇమిడి పోయి కనీ కనిపించని శుక్లపక్ష చంద్రకళ. నాకూ చంద్రికీ ఏమిటో బాదరాయణ సంబంధం? నేను ఆమెను వొదులుకో డానికి ప్రయత్నించడం లేదు. ఆమెదగ్గరకు రావడాన్ని అంగీక రించదు హృదయం. లత పెనవేసుకుంటున్న పోక ప్రమాకు. తొలుదొలుత నే ఆమె నాలో ఏదో విశేషాన్ని అపహరిస్తుం దేమో అని భయపడ్డాను. కాని ఇప్పుడు అదికాదు. దానికన్న విలువైన వస్తువును హరించింది. ఇది మాత్రం నిజం. మాన వత్వానికి అంటి పెట్టుకుని, నా హృదయానికి హత్తుకుని వున్న వొకానొక భావ లత చంద్రి. నేను భావనలో, ఉద్రేకంలో ఆమెను విడువలేను. అతి సమీపంగా నిలుచోనూలేను. నా దగ్గరకు రాలేని అమూల్యమైన గౌరవ ప్రదమైన వొక స్త్రీ మూర్తి, మంటిలో గప్పబడ్డ మాణిక్యం— దాన్ని గ్రహించ డానికి నాకు అర్హతలేదు. దానికి విపుల ప్రచారమూ, ప్రకా శమూ కలుగజేసి దాని విలువను అధికతమం చెయ్యడమే నా విధి.



# 7

మరి మూడునాళ్ళవరకు ఆసుపత్రికెళ్ళడం తటస్థించ లేదు. నాలుగోనాడు కాలినడకన బయలుదేరాను. పల్లె టూళ్ళ మధ్య ప్రయాణాలకు నాబోటివాడికి నడక బహువిధాల ఉపకారిగా వుంటుంది. ఉదయాన్నే మంచుబిందువులతో మురిసిపోతూ వొరుసుకుంటూ నాదేహానికి గగుర్పాటుపుట్టించే జొన్నచేలనూ, పులుసుతో పాదాలను పులుపెక్కించే శనగ మొక్కలనూ, రంగురంగుల బంతిపూల నడుమ ఆకుపచ్చని గుబురుల క్రింద వ్రేలాడే మిరపపళ్ళనూ, ఏనుగుచెవులంతటి ఆకులతో విలసిల్లే పొగమొక్కలనూ కనులపండువగాచూస్తూ దూరాభారాన్ని అగోచరంగా దూరంచేసుకున్నాను. ఆసు పత్రికి చేరుకునేసరికి ఎనిమిదిన్నరయింది.

డాక్టరు అప్పుడే వచ్చాడు. కూర్చున్నాక చంద్రిని గురించి అడిగాను. "ఆ వేళ తెల్లవారుఝామున మూడున్న రకు ఆమె పెనిమిటి వచ్చాడు. రెండురోజులు ఇక్కడే వున్నాడు. మఱునాడు మధ్యాహ్నమే కట్లువిప్పాం." అంటున్న డాక్టరుతో "కట్లు విప్పారా? ఎలావుంది? చూడ నిస్తారా?" అని లేచాను ఆతురతతో. "అబ్బే! ఖులాసా గానేవుంది. ప్రాణాపాయం ఏమీలేదు. నెమ్మదించి లేచి తిరగడానికి పదిరోజులు పట్టవచ్చు. కాని-భర్త ఆమెను ఆసు పత్రిలో వుంచమంటే ఒప్పుకోలేదు. నిన్నటిరాత్రి బండి

చేసుకువచ్చి తీసుకెళ్ళిపోయాడు. వాళ్ళ వూరు ఇక్కడికి దగ్గ రేగా - నాలుగుమైళ్ళు. రోజూ మందుకు వస్తూంటానని చెప్పాడు. పాపం! పేదవాడు - మంచి వినయ సంపత్తిగల వాడు. భార్యకోసం విలవిలదన్నుకుని విలపించాడు నాటిరాత్రి" డాక్టరు ముగించి ఏదో కేసు చూడవలసివుండి బయటకు వెళ్ళాడు.

నేను చంద్రికేమీ అపకారం చేయడంలేదు. ఆమెను కాంక్షించడంలేదుగూడా; మఱి విధి యెందుకు నానుండి దూరం చేస్తున్నాడు ? అసలు చంద్రి నన్ను గురించి ఆలో చిస్తూందా ? అబ్బే ! దానికి తావులేదుగా. ఎలాగైనా ఆమెను ఒకసారి స్ఫుటంగా చూసితీరాలనుకున్నాను.

డాక్టరు తిరిగి వచ్చేసరికి గంటపట్టింది. "దాని భర్త వచ్చాడు కనుపించాడా ?" ప్రశ్నించాడు. "అడుగో" అని ఎదురుగా చెట్టుక్రిందవున్న వ్యక్తిని చూపాడు. పరీక్షగా చూశాను. అతడే, అవే బలమైన బాహువులు, అవిగో జున పాలు, మెలికలు దిరిగిన కండలు, ఆనాడు చీకటిలో కలిసి పోయిన కారునలుపుచాయ అదే. తనను ఆనవాలుపడుతూ అప్రయత్నంగా చేరువవుతున్న నన్నుచూసి పరధ్యాన్నంగా వున్నవాడు చివాలునలేచి నమస్కరించాడు. "ఎవరు నీవు?" ప్రశ్నించాను. "మాది సింగారమండి, ముంగారపు అప్పడు అంటారు." "ఓ! అప్పడా! చంద్రి కెలా వుంది ?" మళ్లీ ప్రశ్నించాను చిలుముగట్టి యుగయుగాలుగా వాడిలో జిడ్డుగా వెలిగే దీపపువత్తిలాగ వున్న బానిసత్వాన్ని చూస్తూ. "తమ

దయవల్ల బాగా నేవుంది. అప్పుడు గనుక కామందులు ఆ సంగతి చెప్పకపోతే అడివిలో తిరుగుతున్న ట్టుంపునండిపాణం. మీరు ఆపడేదాకా ఎన్నో బళ్లు ఆపేశానండి. ఎందరినో అడి గేను. ఒక్క మారాజూ దానిజాడ జెప్పనేదండి" అంతే వాడికి తెలుసు. మంచివానికి తెలిసే ఆస్కారంలేదు.

"లేచి మసలుతూందా?" మళ్లీ అడిగాను ఉత్సుకతతో. "బాబూ! అప్పుడే ఎలా మసులుద్దండీ? మానుబావులు! ఆ కన్న తండ్రెవరో దాన్నెత్తుకుని ఆసుపత్రిలో చేర్చేరుటండి. రేతిరల్లా తొడమీద తలెట్టుకుని, మొగాన నీళ్లు జల్లుతూ తెలివొచ్చేదాకా సేవజేసేరుటండి. పొద్దున్న లేచింది లగా యతు కునుకేసీదాకా ఆ మారాజుని గురించే కలవరిస్తుందండి. చెయ్యెత్తి దణ్ణంబెడుతుంది ఆ బాబుకి రోజూ- ఆయనెవరో గానీ" నిశ్చలమైన తటాకంవంటి మనస్సు; ఆ కొలనులో, రొంపిలో, ఊబిలో మొలిగివున్న తామరపద్మంనంటి హృద యం. చంద్రిదే వీడి మనస్సూ, అందుకే గాబోలు ఏరి కోరి వీణ్ణి ఆశ్రయించింది. "నీకూ చంద్రికీ పెళ్ళి ఎలా కుదిరిందీ?" "సింగారం వాళ్ల మేనత్తగా రూరండి. తనకి తానే నన్ను చేసుకుంది. కాకపోయినా- బాబూ! తల్లిలేనిపిల్ల. ఈడేరింది- తండ్రి రోగిష్టిమనిసి- పదుద్దనం. ఎన్నాళ్లుండగలదండి? దొంగ తనం గట్టి పూరోళ్లు ఎళ్లగొట్టారు. ఏకొమ్మనో వోకొమ్మని పట్టుకోవాలిగందా- నాకూ నచ్చిందిగనక కట్టుకున్నాను. దణ్ణాలండి; డాక్టరుగారు పిలుత్తున్నారు" అంటూ రెండు అంగ లలో ఆసుపత్రిలోనికి పోయాడు. ఏం నడక వాడిదీ! వోపాటి

మనుషుల్ని నలుగుర్ని చులాగ్గా నిగ్రహించగలడు. తేలిగ్గా అడ్డెడు బియ్యపుఅన్నం సాయం పట్టేస్తాడు. చేవలు దేరిన వాళ్లు – అమాంతంగా కావడిలో పెట్టుకుని రెండుకాటాల ధాన్యం అంచీలమీద మోసేస్తాడు ఆమడదూరం. బహుశ ఇవన్నీ చూసుకునే మురిసిపోయి వీణ్ణి ఆశ్రయించింది చంద్రి– మటి అదెంతటి అందకత్తో!

'చంద్రి నేను ఫలానా అని తెలిస్తే భర్త చెప్పినట్లు ఇంకా మన్నిస్తుందా? ఏమో – ఎందుకు గౌరవించదూ? ఎక్కువగానే పూజిస్తుంది. నన్నుగా గుర్తిస్తే సిగ్గుపడదూ' ఇంకొక చిలిపి ఆలోచన.

అప్పుడు తిరిగి వచ్చాడు మందుసీసాతో. నేనూ వాడూ కలసి మాట్లాడుకుంటూ బయలుదేరాం. "సీపాటు ఎలాగుందీ ఇప్పుడు?" "ఏం పాటండి! రెక్కలు ముక్కలు జేసుకుంటే సందాళకి పదణాలిస్తారు. కరువురోజులుగా వుండీ? ఏం పన్లులేవు" "పోనీ కుటుంబంతో మావూరొచ్చెయ్యకూడదూ? కూలోనాలో చూసుకోవచ్చు" "ఏపనీ లేకనేగా వదిలే సొచ్చింది – పైగా ముప్ఫయి రూపాయల జరినామా యియ్యాలట. ఇంతా ఇదయితే ఊళ్లో బాగావుండడం జరగదంట" "నేను చూబిస్తాను. మాకమతంలో పనిచేద్దువుగాని తొలకరించేదాకా. చంద్రి మాఇంటిదగ్గర ఆపనీ యీపనీ చెయ్యొచ్చు" "దానికేంలెండి. నారెక్కలు సల్లగుండాలిగానీ చంద్రి ఊడిగం చెయ్యక్కర్లేదండి వోఅయ్యకాడ. మీదయవల్ల బగమంతుడు కండబిగి యిచ్చాడు. ఎక్కడకెళ్ళి

పుల్లాపుడకా గొట్టుకున్నా, రోజుకి రెండురూపాయలు తెచ్చు కోగల్ను" "అయితే ఇంకనేం, దానికి నెమ్మదించాక వచ్చేయ్" "సరే—దానితో కూడా చెప్పి రావాలిగాందా" అన్నాడు. నాపేరూ, విలాసమూ విడివిడిగా చెప్పాను. "నేను లేకపోయినా ఫర్వాలేదు కమతంలో ప్రవేశించు" అన్నాను.

మఱునాడే పట్నం ప్రయాణం. నేనూ, కాలేజీచదువూ, సభ్యులకై వేపుకుతినే పార్టీలూ, బహిరంగసభల్లో దంపబడి నలిగిపోయే ఉపన్యాసాలూ సిద్ధం. పోనీ కాస్త వినోదానికని సినిమాకుపోతే అక్కడా అది లభించదు. ప్రతి వ్యవస్థా సంస్కారం ధ్యేయంగా వుంచుకున్నట్లు చెప్పుకుంటున్నాయి అంతే. పై మెరుగులకు లొంగి భ్రమసి ఎవరైనా యువకులు మోజుతో ఆసంస్థల కార్యకలాపాలలో పాల్గొంటే - దప్పిక దీర్చుకోడానికని కొంతదూరం వెర్రిగా పరుగులెడితే, ఎంత దూరం వెళ్లినా మనకు మైదానంలోని ఆకాశపు ఆవలి యంచువలె - బయలుదేరినప్పుడెంతదూరమో యిప్పుడూ అంతే దవ్వు ఆదర్శాలు - కేవలం ఎండమావులు. ఈ తంతు లోనూ ఇంకొకచిత్రం! కొంత తరచినవ్యక్తి, ఇతర ప్రజానీకం వల్ల ఈ రంగులో వున్నాడని అనుకోనబడిన, శ్లాఘింపబడిన శ్రేబాయపు యువకుడు: ఆర్భాటానికో, తోడివారి మైత్రికో, గొప్పకో ఆ సుడిగుండలోపడి తిరుగుతూంటాడు. ఆతన్ని ముందుంచుకుని అంధుని వెంటబడిపోతూన్న అంధుల వలె ఎందరో తిరిగినస్థలాలనే తిరుగుతూవుంటారు. నమలినమలి కమలిపోయిన భావాలనే నెమరువేస్తూవుంటారు. వీరిలో అజా

గళ స్తన్యప్రలోభ పీడితులైన గోమాయుప్రభృతులు కొందరు. ఈ చిత్రాలూ, సమాజాలూ చెప్పే పోకడా చూస్తే చంద్రి లాంటి అమాయకులను ఉద్ధరించడానికి కంకణాలు గట్టుకున్నట్లు కనుపిస్తారు. పాపం వాళ్ళో- రాకరాక ప్రచారానికి పల్లెలకు వచ్చే యీ క్రొత్త ముఖాలను చూచి, మురిసి, ఆదరించి వీరి బాకాలకు చెవులొగ్గి మోజుపడతారు. రోజురోజుకూ వీరి వలలో తగుల్కొని అమాయకులైన మూగజీవాలు మోస పోతాయి. పట్టణాల కర్మాగారాలలో తయారైన సరుకు పల్లె టూరి చేతిపరిశ్రమలను నాశనంచేసినట్లు, నగరాలలో తర్ఫీదు పొందిన పార్టీలు పల్లెజీవితాన్ని భ్రష్టుచేస్తున్నాయి.

ఎంత ఆలోచించినా చంద్రి అంతదూరాన్నే వుంది ఈ సంస్కారానికి. నేను చూశాను చంద్రి నొక్కదాన్నే - అయితే ఇలాంటివాళ్లు ఎందరో వాడవాడలా, ఊరూరా, వందలు, వేలు కనుపిస్తారు సహృదయంతో వెదికితే. మన విద్యాధికులు పల్లెసీమలో నిజమైన వెలుగులో బ్రతికిననాడే వీరి తమస్సు విచ్చిపోవాలి.



# 8

నెలరోజుల తర్వాత ఇంటికి డబ్బుకై వ్రాసే వృత్తరంలో పేర్కొన్నాను "ముంగారవు అప్పయ్య అనేవాడు కమతంలో పనిచేస్తానంటూ వచ్చినదీ లేనిదీ తెలియజెయ్యవలసిందిగా-" నేను ఊహించినట్లే సమాధానం వచ్చింది. చెల్లాయి సీత ఇట్లా వ్రాసింది-

'ప్రియమైన అన్నయ్యకు,

సీత నిత్యం అనేకంగా నమస్కరించి వ్రాయునది. ఉభయకుశలోపరి. నీవు కోరినట్లు సొమ్ము నేడే పంపుతున్నాము. యూనివర్సిటీ ఫైనలుక్లాసు గనుక పరీక్షవిషయమై బహు శ్రద్ధగా చదువమని అక్కయ్య మరీమరీ వ్రాయమన్నది. తప్పక ప్యాసయ్యేటట్లు చూడవలెను. సంక్రాంతికి మాత్రం ఒకసారి యింటికి వచ్చి వెళ్లవలెను.

తర్వాత నీవుకోరిన ప్రత్యేక విషయాన్ని గురించి: వారంరోజుల క్రితమే వాడు పనిలోకివచ్చాడు. బాగానే పని చేస్తున్నాడు. మంచి, ఖచ్చితమైన మనిషి. జొన్నలూ, కందులూ కోతకువచ్చాయి. మిరపకాయలు రెండుదఫాలుగా కోస్తున్నారు. ప్రవేశించి వారం రోజులే అయినా పెద్దపాలేరు లాగున పనినడుపుకుంటున్నాడు.

అన్నిటికన్న విశేషం వొకటి. వీడు మనవూరు విడిచి వెళ్లిపోయిన చంద్రి పెనిమిటి. మొదట్లో తానొక్కడేవచ్చాడు.

అక్కయ్యా, నేనూ పట్టుబడితే సింగారంవెళ్లి పెళ్లాన్ని తీసుకొచ్చాను. మునుపటికన్నా చంద్రి ఇప్పుడు బాగావుంది వీడి పోషణలో. నిన్ననే మనింటికి వచ్చి చాలాసేపు మాట్లాడి వెళ్లింది. అప్పుడు దాన్ని రవ్వంత పనైనా చేయనివ్వడు. అడుగులకు మడుగులొత్తుతూ పువ్వులా చూసుకుంటున్నాడు. తండ్రి వెంకడికి జబ్బు అలాగే వుంది.

నీవు ఆసుపత్రికి వెళ్లిన మర్నాడే డాక్టరుగారు అప్పడితో చెప్పారుటసంగతంతాపూసగ్రుచ్చినట్లు. వాడు పెళ్లాంతో చెప్పాడట. అదినిన్నుతలంచుకుని 'ఎలాంటిబాబుగారితో సేవ చేయించుకున్నానురా దేవుడా!' అని కుమిలికుమిలియేడ్చింది-అక్కయ్యాతో చెప్పి సిగ్గుతో కళ్లనీళ్లు నింపింది. నీవే ప్రాణ దానంచేసిన భగవంతుడవని వేనోళ్ల కొనియాడింది. మొదట్లో యీ సంగతులు చెప్పడానికి బిక్కపోయింది అభిమానంతో. ఇప్పుడు యెప్పుడోగాని ఊళ్లోకి రావడంలేదు ఇల్లు విడచి. చిన్నప్పుడు చదువుకున్న ముక్కలు మఱచి పోకుండా అప్పుడప్పుడు మనింటికి మధ్యాహ్నం వేళవచ్చి నన్ను వేపుకు తింటూంది అవీ ఇవీ చెప్పమని. చంద్రి చాలా భక్తి వినయాలుగలపిల్ల, తెలివైనది. నీ ప్రసక్తి వచ్చేసరికి ఎంతో భయంతో, అభిమానంతో క్రుంగిపోతుంది. మొగుడుకి తెలియనీయకుండా చిన్నపనీ చితకపనీ చేస్తూవుంటుంది.

అక్కయ్య ముప్ఫయిరూపాయలిస్తే అప్పయ్య తనకు తెలీయకుండా పుచ్చుకుని, కాపులకు జరిమానా చెల్లించాడని చంద్రి ఎంతో దుఃఖించింది. "మీ రుణం ఎలా తీర్చుకో

గలం? తల్లి లేని పిల్లను కన్నతల్లిగా కడుపులో బెట్టుకొని సాకుతున్నార" ని కన్నీటితో మాదగ్గర వాపోయింది. "డబ్బెందుకు పుచ్చుకున్నావూ? వెంటనే బాకీ తీర్చెయ్యాలి. పెద్దమనుషులతో వ్యవహారం - వారు మనకు చేసిన మేలుకు చర్మంతో చెప్పులు కుట్టిచ్చినా రుణం మళ్లుతుందా?" అని హెచ్చరించింది భర్తను. అప్పడిచాటునఉన్న చంద్రి ఇప్పుడు విరాటనగరంలో వలలుడి కాపులో ఉన్న సైరంధ్రి- ఇట్లు మీ చెల్లెలు-సీత-'

లేఖలోని తుదిపలుకు మంచి ఘాటుగా వుంది. మా వూరును చంద్రి మళ్ళీ వొక ఆట ఆడిస్తుంది. ఎంత పౌరుషం లేకుంటే డబ్బుపుచ్చుకున్నందుకు మొగుణ్ణి అలా నిఘా చేస్తుంది? గ్రామంలో జరిగే అన్యాయానికి ఇంక ధైర్యంగా యెదురుతిరుగుతుంది. తిరగడూ! దొంగతనంనాటి మరునాడే నామాట నాకు నప్పచెప్పింది. ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వొకళ్ళిద్దరు ఇలాగున గ్రామనిరంకుశత్వానికి యెదురీద లేకుంటే ఇతరులు అమాయకంగా మ్రగ్గిపోతారు. నా ప్రాణం వొకందుకు కుదుటబడ్డది, ఇప్పుడు చంద్రికి అప్పుడు పెట్టని కోట. ఈ సవాలుకు గ్రామం యెదురుదెబ్బ తీస్తుందో లేక అణగిమణగి పడివుంటుందో చూడాలి.

సంక్రాంతికి ఇంటికెళ్లాను. అనుకున్నట్లుగానే జొన్నల రాలిక బాగుంది. లేకుంటే పిల్లామేకాతో పల్లెజనం మాడిపోయివుండేవారు. పెద్ద పెద్ద ఇళ్ళల్లోగూడా కూటికి కటకట

పడుతున్నారు. డొల్లాకు పోయి తెచ్చుకోవాలి ధాన్యం. వరి కూడుగాని సొక్కని మారాజులు.

అప్పడు చురుకుగానే పనిచేసుకుపోతున్నాడు. అక్కయ్య యిచ్చిన ముప్ఫయిరూపాయలూ వాడకంలోనే చూసుకో మన్నాడు. పండుగ బహుమతిక్రింద పట్టుబట్టి వాడికో పంచీ, చంద్రికో చీరా కొనిచ్చాం - కరువు రోజులవల్ల యీయేటి సంక్రాంతిలో కళకాంతులు లేవు. ఏటా కోడిపందాలూ, గొర్రెపందాలూ ఉండేవి. అవిగూడా పొరుగూళ్లకు పరుగెత్తాయి. మే మిచ్చినబట్టలు కట్టుకోడానికి చంద్రి యెంతో బిడియ పడిందని అప్పడు చెప్పాడు. "ఏఁరా - మాకింకొక తోబుట్టు వుంటే దాన్నీ, పెనిమిటినీ పెద్దపండుగకు తీసుకొచ్చి ముస్తాబు చెయ్యమూ" అన్నాను — ఆమాటగూడా చంద్రికి చేరింది అప్పడిముఖంగా-

"చంద్రిని గట్టుకున్నందునల్ల నీవు అదృష్టవంతువయ్యావురా" అనేవాడిని అప్పుడప్పుడు అప్పడితో - "ఏమో దొరా - అది దేవునిదయ" అంటాడువాడు. "చంద్రిగాదురా- అది చంద్రిక వంటిదిరా - దాన్ని చంద్రికా అనాలనిపిస్తుంది నాకు" అంటే, అక్షరజ్ఞానంలేని అప్పడు సెలవులు బారచాచి నవ్వుతూ "చందిరి కేంటుండి - కందిరీగ లాగ అదేం పేరూ" అంటాడు. నాకూ చెల్లాయికీ కడుపుబ్బ నవ్వొపుట్టుకు వచ్చేది.

రెండుమూడు దఫాలు మాలపల్లి మీదుగా రేవడికి వెళుతున్నప్పుడు చంద్రి అవుపిస్తుందేమో అని చూశాను.

లాభం లేకపోయింది. ఇద్దరు ముగ్గుర్ని సందర్భవశాన దాన్ని గూర్చి అడిగాను గూడా. "ఈమధ్యనే దగ్గుతో తీసుకుంటూ తండ్రి వెంకడు కాలం చేశాడండి. అందుచేత దానికి ఏమీ కలివిడిగా లేదండి; లేకపోతే లేడి పిల్లలాగ రోజుకి మూడు సార్లు మాలపిల్లిలో చెంగుచెంగుమంటూ తిరిగేది చంద్రి" అన్నాడు పెద్దమాల భీమడు.

"అయ్యో! పాపం చంద్రికి ఎన్నికష్టాలు ప్రాప్తించాయి?" కొంచెం పరిస్థితులు మారినాయిగూడా. తండ్రి పోవడం – ఊళ్ళో అప్పుడు దాన్ని అందరు ఆడాళ్ళవలెగాక ప్రత్యేకంగా పోషించుకోవడం, ముఖ్యంగా వొకళ్ళ చేతిక్రింద మసలక్కర్లేకుండా మా కమతంలో ఈ కుటుంబానికి అన్నీ గడచిపోవడం గ్రామంలో వీరిపట్ల అసూయను పాదుకొల్పాయి. క్రితంరోజులలో చంద్రివైపు నానావిధాలా చూచిన బాబులు, దానిచేత అవమానింపబడ్డ యువకులు లోలోన పరాభవాగ్ని రగుల్కొల్పుకుంటూ తరుణంకై వేచివున్నారు ప్రతీకారానికి. మాలలలో గూడా వీళ్ళ ఉనికి పొరుగువాళ్ళకు కంటగింపుగా వుంది. "అది రాణీగారేంట్రా కూలికి పంపవ్రూ? పోనీ వొంటి స్తంభంమేడ గట్టించి, నౌకర్లనీ చాకర్లనీ పెట్టించరా దానికి?" అంటూ వెటకారాలు మొదలెట్టారు. కాని వొక్కటి – అప్పుడు మౌనంగా సౌమ్యంగా వున్నాడా సరే–కొంచెం కళ్ళెరజేసేడా ఎలాంటివాడికైనా గుండెలు బిక్కు బిక్కుమనక మానవు.

చంద్రి నన్ను తప్పించుకోడానికి ప్రయత్నించింది. నలుగురూ తన్నుగురించి పలువిధాల విమర్శించడమే దీనికి దారితీసింది. మునుపటిరోజుల్లో చీటికీమాటికీ ఊరిలోకి వచ్చేది. ఇప్పుడు మిక్కిలి అవసరంవుంటేగాని ఇల్లు కదలడంలేదు. పండుగకు మా యింటికేసి రానేరాలేదు. తరచు వచ్చిపోయే అలవాటు తప్పించింది. "ఏన్నాళ్ళనుండి రావడంలేదే" అడిగాను సీతను. "తండ్రిపోయి నప్పటినుండి రాకపోకలు తగ్గించేసిందిరా" అంది చెల్లాయి. గ్రామంలో పరిస్థితినిబట్టి మొదట్లో అతి చనువుగా వుండే అప్పుడుగూడా ముక్తసరిగా పొలం పనులు మాత్రం జాగ్రత్తగా చూసుకు పోతున్నాడంటే.

అనూహ్యమైన నూతన వాతావరణం పెంపొందు తోంది మా యిరువురమధ్య. ఏదో పుండువంటిది మొలకెత్తి వుంటుంది వారి మనస్సుల్లోనో, లేక ఊరివాళ్ళ హృదయాల లోనో. అది గూడుకట్టి ఏరూపంలో బద్ధలవుతుందో– లోకం నోరుమూయడానికి మూకుడు లెక్కడ? నేనూ చంద్రీ కలుసు కోవడం సంభవించలేదు ఈ దఫాలో – ఇది నాపూర్వ స్మృతులను మరింత బలంచేసింది.



# 9

పపరీక్షలై పోయాయి. భావిజీవితాన్ని గూర్చి ఊహాసౌధాలు నిర్మించుకుంటూ ఇంటికి ప్రయాణమయ్యాను. గృహసమస్యలు అనేకం నన్ను కలవరపెడుతున్నాయి. కారు నెక్కి ఆలోచించడం ప్రారంభించాను. రేపటినుండి ప్రొద్దు పుచ్చడం ఎలాగ? ఏ ఉద్యోగం చెయ్యాలి? పోనీ గ్రామంలోనే వుంటే? విద్యార్థిదశలో అనేకసార్లు నిర్మించుకొన్న గాలిమేడలు నీలినీడలుగా హృదయఫలకంమీద తారాడి తేలిపోతున్నాయి. ఏదీ స్నిగ్ధంగా నన్ను నిలువబెట్టలేక పోతోంది. మనం చిన్నతనంలో నిర్మించుకున్న ఆశాసౌధాలు యౌవనం వచ్చేసరికి పునాదులతో సహా గగనవీధి కెగసి స్మృతిపథాన విహరిస్తాయి.

కారుదిగి ఊరువైపు మళ్లీ నడక ప్రారంభించాను. వచ్చే యేడు ఎలాగునా నేను ఇంటివద్దనేవుండాలి. తప్పదు. కాబట్టి రెండువిధాలుగా నాఉనికి వినియోగంకానచ్చు. ఊరిపొలిమేరకుచేరువగావున్నతోటలో ప్రవేశించాను. అక్కడవున్న చింతచెట్టుక్రింద జరిగే సంభాషణ నన్ను హఠాత్తుగా నిలిపివేసింది.

“అలాగనుకోడం చాలాతప్పు.ఆధారం లేనిదే మనం ఒకరిని అనుమానించగూడదు.” ఇది మిత్రుడు ప్రకాశ్ రావు కంఠం. రెండో వారెవరో తెలీదు. “వాళ్ళిద్దరికీ సంబంధం చాలా రోజుల నుండి వుండివుండాలి. లేకుంటే చేతికి చిక్కిన

దాన్ని ఆయన రాత్రి ఎందుకు వదలిపెట్టాలి?" "దొరికిందని నీవెలా చెప్పగలవు?" "అదేచెప్పిందట. దొంగతనం చేశానని వొప్పుకుందిగా" "నేను నమ్మను. చదువుకున్నవాడు - అలా ప్రవర్తించడం అసంభవం". "మగవాడు గాదా! చదువుకున్న వాళ్ళే బహు నేర్పుగ లొంగదీస్తారు ఇలాంటి రకాలను-షష్ఠి నాడు తీర్థానికి వచ్చాడు. కృపాదాసును తరిచితరిచి ఉడి గాడుట. ఆఖరికి దానికి దెబ్బతగిలినప్పుడు బండి మీద ఆసుపత్రికి తీసుకెళ్ళి స్వయంగా తెలివొచ్చేదాకా సేవచేస్తున్నాడు." నాహృదయాన్ని కలచివేస్తోంది ఆ సంభాషణ. దానిలో నేనే ముద్దాయిని కానడం నా ఉద్రేకాన్ని మరింత రెచ్చగొట్టింది. గుండెలు చిక్కబట్టుకుని చదికిలబడి చెవియొగ్గి నిశ్శబ్దంగా శ్రద్ధతో వింటున్నాను. ప్రకాశరావు పరోక్షంగా నా తరఫున వాదిస్తున్నాడు.

"చంద్రికోసమనే తీర్థానికి వెళ్ళారనడం ఏమీ సబబుగా లేదు. ఆసుపత్రిలో అన్నావు- పరోపకారం ఎవ్వరైనా చేయవలసిందే" "ఔను- అంతా పరోపకారమే. నాలుగు రోజులు దానికోసం చదువుకు శెలవుపెట్టడం- కాలుగాలిన పిల్లిలాగ ఆసుపత్రికి తిరగడం, అప్పడిని ఇవ్వూరునుంచి తీసుకొచ్చి కమతంలో పెట్టుకోవడం, గింజలు బారిగా కొలవడం, చీరెలూ, రవికెలూ కొనిపెట్టడం, రోజూ సంజవేళ మాలపల్లి వీధుల వెంట షికార్లు- పాపం! ఎంతటిపరోపకారం! దానకర్ణుడు ఈ నాటికి బయలుదేరాడు యీ పాటిమీద. ఒక్కమాట విను. ఈ కాలంలో యెవరైనా యెవరికైనా ఏదైనాపల్లెత్తుపనిచేశారూ

అంటే– కేవలం ఏదో ప్రతిఫలం వాంఛించారన్నమాట. పరోపకారం, న్యాయబుద్ధి, నిజాయితీ ఇవి వెనుకటిమాటలు!" "ఏమో ఇదిమాత్రం నాకు గిట్టదు. ఊరంతా ఏమనుకున్నా సరే. నేను మాత్రం ఆయన్ను శంకించలేను" ప్రకాశరావు తుదిసారిగా తీర్పుచెప్పాడు ఖచ్చితంగా.

చివాలునలేచి ఆపెద్దమనిషిని అక్కడనే నిలవేద్దామనుకున్నా కాని తొందరదేనికి అనిపించింది. ఇంటికెళ్ళాక వారంరోజులవరకు నాకేవేట సరిపోయింది. పలువురిదగ్గరనుండి బహుముఖాలుగా పాక్కింది ఈ వదంతి. మాలపల్లెలోగూడా చాటునామాటునా కొన్నాళ్ళు మసులుకున్నాయిఈమాటలు. విన్నవాళ్ళు చాలామంది మనకెందుకని ఊరుకున్నారు. చంద్రిచేత రహస్యంగా అవమానితులైనవాళ్ళుమాత్రం ఈ అగ్ని ఆరిపోకుండా అప్పుడప్పుడు ఊదుతున్నారు. ఒకరి ద్రుక్కులు నావంక సందిగ్ధంగా ప్రసరింపబడ్డప్పుడు, శల్యపరీక్షచేసి నేను ఈభావాన్ని వారినుండి లాక్కుంటున్నాను. గ్రామం గనుక నాబోటి వ్యక్తి దీనికి ప్రాధాన్యమివ్వక తప్పిందికాదు.

కొన్నాళ్ళ తర్వాత–మా ప్రత్తిచేను విడుదల మొదలుపెట్టారు. ఏమీ తోచక అలా బయలుదేరాను. అప్పుడు దగ్గరుండి బహు జాగ్రత్తగా ప్రత్తి విడిపిస్తున్నాడు పదిమంది ఆడ కూలీలతో. ప్రతిదాన్నీ పరోక్షంగా పరిశీలించాను. చంద్రి కనుపించలేదు. చాలాసేపటిదాకా అప్పడు నన్ను పసికట్టలేదు. పనిచేసేవాళ్ళు రహస్యంగా ప్రత్తి దాచేస్తారేమో అని భద్రంగా చూస్తున్నాడు.

"ఎప్పు డొచ్చారండి కామందులు?" నమస్కరిస్తూ నవ్వుమొగంతో ప్రశ్నించాడు. ప్రశ్న వేసిన కంఠంలో, నవ్వులో, వాని ముఖవైఖరిలో, విస్రమంగా నిలుచోవడంలో ఏదో అసంపూర్ణత నాకు ద్యోతకమైంది. మొదట నాలో ఆవేదననుబట్టి ఎదుటవుండే ప్రతి దృశ్యమూ అలాగ అను తున్నదా అని భ్రమించాను. అప్పడిసంచలనం గుర్తించిన కొద్దీ నాది భ్రమగాదని ధృవ పడింది. "నిన్న రాత్రి" దీక్షగా చూస్తూ సమాధానమిచ్చాను. "మళ్ళీ వెళ్ళాలాండి?" జాలి గొలిపే కంఠం. "అక్కర్లేదు. ఇక చదువు అయిపోయినట్లే" "ఎన్ని రూపాయల ఉద్యోగం వస్తుంది బాబూ?" అమాయి కంగా అడిగాడు. "పనిచేస్తే నెలకు వందను తక్కువివ్వరు— అప్పడూ! చంద్రీ వాళ్ళూ ఖులాసాగా ఉన్నారా" అదోక లాగున ప్రశ్నించాను. "బాగానే వున్నామండి తమ చలవ వల్ల—మా చెల్లిగా రింటికెళ్ళొస్తానని పోయిందండి. నాలుగు రోజులైంది. నెల్లాళ్ళలో వస్తుంది. అయితే బాబూ! ఇంతఖర్చు చేసి చదివారుగందా. ఏపనీ చెయ్యరూ?" "చెయ్యాలి అనుంది గానీ ఒక యేడాదిపాటు ఇంటిదగ్గరే వుండిపోవాలిరా. నీకు గంజి ఎవరు పోస్తున్నారురా?" "అమ్మగారే—'మళ్ళీ నీవు ఏం చెయ్యిగాల్చుకుంటావురా—మాయింటికాడనే ఇన్ని మెతుకులు పెడతాం' అని శెలవిచ్చారండి" అన్నాడు. ఇంతకుమించి తొలినాళ్ళనాటి చనవూ, ఆనందమూ వాడి వైఖరిలో లేవు. చంద్రి అప్పడిని విడిచి వెళ్ళేబాపతుకాదు. తేలికగా దానికి నచ్చజెప్పడమూ కష్టమే. తగిన కారణం లేనిదే ఊరు కదలదు. తెలుసుకోవాలని నామనస్సు వేగిరపడింది.

సాయంత్రం మళ్ళీ పసుపులపాకలో కలుసుకున్నాం నేను, అప్పడూను. సాధ్యమైనంతవరకు నన్ను తప్పించుకోడానికి ప్రయత్నించాడు. గడ్డితేవాలనీ, చేలో పనుందనీ, ఏవేవో సాకులు పలికాడు. నేను అక్కడ కొంచెం హోదా ఉపయోగించాను. నిలిచిపోయాడు.

ఉపక్రమించాను సంభాషణ "దిగులుతో వున్నావేం?" "అబ్బే ఏమీలేదండి" "నీకూ దానికీ ఏదేనా పేచీవచ్చిందా? వచ్చినప్పటినుండి చూస్తున్నాను. మొదటిలోవుండే కలివిడి అవుపించదేం? ఊళ్ళోవాళ్లెవరైనా గొడవ లేవదీశారా?" బిక్కమొగం వేసిన కొడుకునుచూసి జాలిగా ప్రశ్నించే మాతృత్వం నాకంఠంలో నిండుగావుంది. "గొడవేముంది బాబూ! లేనివాడంటే పతిమారాజుకీ లోకువేగందా- ఉన్నదోటీ లేనిదోటీ తలోబాదూ బాత్తారు. మాపని రెండిందాలా చావేనండీ. అంటె ఆకొచ్చి ముల్లుమీదబడినా దానికే ముప్పు. ముల్లొచ్చి ఆకుమీదపడ్డా ఆకుకే ప్రమాదం. ఏదో ఇలాగేనుండి నీలుగారిపోతాయి మాబతుకులు" పిల్లినోట చిక్కుకొని విలవిలదన్నుకుంటూ రెక్కలార్చే గోరువంక స్వరం అది; ధనికవాదంమోపిన భారాన్ని వహించలేక అణగారిపోతూ, చితికిపోతూ, జీర్ణమౌతూ ప్రాణంమీద తీపికొలదీ అంగలార్చే పేదరికపు స్వరూపం ఆధ్వని.

సందిగ్ధంగా ఉన్నాయి వాడిమాటలు. "నువ్వనే దేమీ నాకు అర్థంకావడంలేదు. ఇప్పుడేం కొంపమునిగిందీ?" విరుసుగా అడిగాను-"చదువుకున్న మారాజులు మీకు తెలీనిదేమీ

వుండదండి. ఊళ్ళో అడుగెట్టి రెండు నాళ్ళైందాండి. ఒకళ్ళననికేలాభం దొరా– మన బంగారం మంచిదైతే! మీరు పోషించాలి. మాలాంటోళ్ళం మీపాదాలకాడ పడుండాలుండి. అలాంటిది కంచే చేను మేస్తే! తమరే" అప్పుడు ఇంక మాట్లాడలేదని స్పష్టంగా చెబుతూంది ఆవణుకు. కళ్ళు నావైపు దీనంగా చూస్తున్నాయి. 'ఇలాంటివాడు ఎవడైనా వుంటాడా?' అనిపిస్తుంది మీకు. కాని అనుభవంమీద తేలుదొలుతి మీవంటివాణ్ణే అయిన నాకు ఇలాంటివాళ్ళేగాదు– ఇంతకంటె సత్యగోపులుంటారని తేలింది. మనిషిది వొక విచిత్రప్రకృతి. అది ఇలావుంటుందని అందరికీ ఏకీకృతంగా నిర్వచించటంనంటె పొరబాటు ఇంకొకటి వుండదు.



# 10

లోకపు విమర్శలకు మాకీభావం వహించక తప్పలేదు. పాత్రాలలో దసులుపడ్డ కథలలోని అనుభూతులు ప్రత్యక్షంగా మెదలడం మొదలెట్టాయి. బ్రతుకుబాటలో మనం తలంచేది, చేసేది, చెప్పేది సత్యమే అయినప్పటికీ చూచేవారిలో గూడా దాని ఫలితం ఇమిడివుంటుంది. కొన్ని సందర్భాలలో మానవుడు కఠోరంగా వ్యవహరించవలసి వుంటుంది. విరక్తి కలుగవచ్చుగూడా. ఐనా మన పథంనుండి చలింపగూడదు.

కాలచక్రం వేగంగా పరిభ్రమిస్తోంది. నూతన సంవత్సరం ప్రవేశించింది. వసంతఋతువు మేలుచేసింది. చంద్రినీ·

నీళ్లు త్రాగాను. ప్రకృతికాంత ప్రసాదించిన అమృతం. ముగ్ధునిచేసి అదృశ్యం నన్ను అక్కడే కూర్చుండబెట్టింది. కారడవిమధ్య కఠినశిలోపలమందలి ఈతావు గుడ్డిలోకంలో క్రూరజనులమధ్య, మహా దారిద్ర్యంలో మ్రగ్గిపోయే మానవ హృదయాంతర్గత కరుణరసాన్ని జ్ఞప్తికితెచ్చింది. విశ్రమించిన నాకు వెంటనే నా ఉనికీ, గృహమూ స్ఫురణకు వచ్చాయి. లేచి-మళ్ళీ వచ్చినదోవ బట్టాను. వచ్చేటప్పుడున్న సత్తువ కాళ్ళలోలేదు. ఆవేదనమాత్రం అధికంగావుంది. ఇల్లూవాకిలీ విడిచి ఇలా వచ్చేశానేమిటా అని విస్తుపోతున్నాను. అలాగునేనడుస్తున్నాను. కలలో ఇదొకవింత. మొదటబయలు దేరినప్పటి మార్గం కాదిది. వెలుగు క్రమంగా మంద మయ్యింది. ఎలాగ సాయంకాలమైపోయిందో! బరువుగా అడుగులేసుకుంటూ నేను నడుస్తున్నది ఒక విశాలమైనరాజవీధి.

నా వెనుక ఏదోవాహనం, పెద్దరథంవంటిది వస్తున్నది. ప్రక్కకు తప్పుకున్నాను. యంత్ర సహాయంతో శరవేగంతో పురోగమిస్తూంది. దానిలోకూర్చున్నవ్యక్తి మార్గంలో వారిని హెచ్చరిస్తూ తొలగిపొండని కేకలేస్తున్నాడు. రాబోయే దృశ్యాన్నిచూస్తూ, నాఅవస్తను మరచిపోయి నిలబడిపోయాను. రక్షకభటులు మరొకదారిన వచ్చి బాటకు యిరుప్రక్కల పహరాయిచ్చారు. నిర్మానుష్య సంచారంలో,వెలుగువెలార్చుకుని దేదీప్యమానంగావున్న ఆ దోవనుబడి ఎన్నో యంత్ర శకటాలు వెళ్ళిపోతున్నాయి వేగంగా. అ లం క రిం ప బడ్డ మోటారు కారులవరె వున్నాయి. స్త్రీలూ,పురుషులూ గూడా

జంట జంటలుగా ముందు భాగాలలో ఆసీనులయి యున్నారు. దేవలోకంనుండి ఎవరో భూమికి దిగివస్తున్నట్లుంది.

పరంపరగా శకటాలు వస్తూనే వున్నాయి. ముందు గొప్పయంత్రాలు, ఎంతో అందంగా అలంకరింపబడినవి, తర్వాత సాధారణమైనవి, చివర వచ్చేవి జంతువులవలె మనుష్యులనే గట్టి ఈడ్వబడుతున్నాయి. బలిష్ఠులైనవాళ్లు లాగుతున్నారు. ఆబళ్ళలోనే కొందరు స్త్రీలు దారుణంగా హింసింపబడుతున్నారు. రాక్షసులవంటి రక్షక భటులు వారిని యమయాతనలు పెడుతున్నారు. బళ్ళు వేగంగా పరుగెడుతూంటే దారి కిరుప్రక్కలా దుమ్ము చెలరేగుతోంది.

ఇలాగ సాగిపోతున్న వారిని వొళ్లుమరచి చూస్తున్న నాకు అకస్మాత్తుగా ఏదో పదార్థం తగిలింది. గజగజవణుకుతూ ఏమిటా అని ఆలోచించాను. స్పృహలేని, నిస్సహాయమైన, దీనవదన ఒక స్త్రీమూర్తి. "ఎవరో తెలీదు. నన్నురక్షించమ"ని బహుజాలిగా నాదెసకు వాలిన అనాథ- ఆమెను పరిగ్రహించ వచ్చునో కూడదో బోధపడలేదు. ఆపదలోని ఆమెను రక్షించడానికే నిశ్చయించుకున్నాను. మాట్లాడటానికిగాని, ఆమెను చక్కగా తిలకించడానికిగాని ఆమె నిస్సహాయత నాకు అవకాశమియ్యలేదు. గుడ్డిలోకం కప్పిన తెరలక్రింద, అణగిమణగి ఆకాశందాకా ఎగసే క్షణంకోసం ఆకాంక్షతో ప్రతీక్షించి కుమిలి కుమిలి క్రుంగిపోయే మానవియైన నిరుపేదజీవి.

లేవనెత్తి ఆమె బరువైన దేహాన్ని నిలబెట్టడానికి ప్రయత్నించాను. లోకానికి దయవుంటేగా-రాక్షసులు.అంతా

క్రూరులే. మృగప్రాయులు. పయోముఖ విష కుంభాలు. తుప్పటిలో గర్జించుకుంటూ మామీదపడ్డారు. నన్ను తాము నీచంగాచూచి, కాముకునిగా జమకట్టి చేతనున్న కొరడాలతో మమ్ము చితగగొట్టి ఆమెను నానుండి వేరుపరచారు. 'దేవా! దీనులకు మనసారా సేవచేసే అవకాశం నాకు ఎందుకు ప్రసాదించవూ' అని ఉస్సురుమన్న ప్రాణంతో వారిచేతుల్లో శవప్రాయంగావున్న ఆమెను కళ్లనీళ్లతో చూశాను. మరుక్షణంలో ఆయువతి నాదృష్టిపథంనుండి మాయమయ్యింది మరికనుపించకుండా శాశ్వతంగా.

"అన్నయ్యా! అన్నయ్యా! లేరా—లే" సీత నన్ను కొడుతూ లేపుతోంది. ఎంతసేపటినుండి నన్నలాకొడుతోందో - "కొంపలంటుకున్నాయిరా— అవిగో మంటలు చూడూ— లే" అంది. వెంటనే లేచి కళ్లు నులుముకుంటూ ఉత్తర దిశను చూచాను— ఇంకేముంది? మాలపిల్లి అంటుకుపోయింది. దుప్పటిని మంచానికి వేసికొట్టి హుటాహుటిని రెండు ఉరకల్లో గూడెం చేరుకున్నాను.

అప్పటికే వొకయిల్లు పూర్ణాహుతి అయ్యింది. నలుమూలలనుండి జనం మూగిపోయారు. బిందెలతో నీళ్లు అందిస్తూంటే కొందరు బొక్కెనలతోనూ, చేటలతోను కొంపలు ఆర్పుతున్నారు— మరికొంతమంది ముందుగానే తమయిళ్లు తడుపుకుంటున్నారు— తట్టలతో ఇసుక మీదికిచిమ్మేవారూ, వెదురుగడలతో పెణకలు దిగలాగేవారూ హడావుడిగా వున్నారు— వాసాలుపగిలి శబ్దంచేస్తూ అగ్నిని విజృంభింపచేస్తు

న్నాయి. సాహసించి నేనొక నడికుప్ప ఎక్కాను- క్రిందనుండి యిచ్చేనీళ్లు అందుకుని మంటలు ఆర్పుతున్నాను- గంటసేపటికి ఆయిల్లు చల్లాగేస్థితికి వచ్చింది. "లోప లెవరేనా వున్నారేమో చూడండి" అన్నాను వొకకుర్రవాడితో. వాడు తలుపుతడివి "లేరండిబాబూ, తలుపు గొళ్లెంపెట్టివుంది" అన్నాడు. ఇంకా నిప్పు పూర్తిగా ఆరిపోలేదు- ఇంతలోనే లోపలనుండి ఏదో ఆక్రందనం వినవచ్చింది. ఎవరోవ్యక్తి మూలుగుతూ ఏడుస్తున్నట్లుగుర్తుపట్టాం. వెంటనే గొళ్ళెంతీసేశాను- లోపలవున్నది వొకస్త్రీమూర్తి. బట్టలూ, మంచమూ కొంచెంగా కాలుతున్నాయి- సాహసించి బలంగా మంచాన్ని గుమ్మందగ్గరకు లాగాను.

లాగిన వెంటనే పైనుండి ఆరిపోతూన్న చితుకులతో ఊగులాడుతున్న రెండుదూలాలు గుభీలుమని ఇంటిలోకి కూలిపోయాయి - ఆమెను సందిట బట్టుకుని క్షణంలో వీధి వారనే వున్న నిద్ర గన్నేరు చెట్టుక్రిందకు చేర్చాను. మండుతున్న ఆమె చీర చెరగును కాలితో నేలరాచి ఆర్పివేశాను- మంటలో, పొగవల్ల గ్రుక్కి, మాడి ఆమె బాకా వుక్కిరిబిక్కిరై పోయింది. కడుపు ఉబ్బింది. శ్వాసకోసం ఎంతో పెనగులాడుతోంది జీవి.

"పాపం - ఎవరో ఈమె" అంటూ ఆమెకు స్పృహ గలిగించడానికి ప్రయత్నిస్తున్నా. మాచుట్టూ చాలామంది మూగారు - రెండుయిళ్లు పూర్తిగా కాలిపోయాయి - మూడవది సగం అయిపోయింది. త్వరగా వాళ్లు మేలుకోవడం. గాలి

లేకపోవడంవల్ల చల్లబడిందిగాని లేకపోతే గూడెమూ, ఊరూ గూడా భస్మమై పోయివుండేవి.

చుట్టూ చేరినవారు ఆమెను ఇట్టే గుర్తుపట్టారు. "ముంగారపు చంద్రి. ఊరికెళ్ళింది ఎప్పుడొచ్చిందో కదా ఈ బాదకోసం – ఏ చచ్చినోడో దీన్ని లోనబెట్టే గొళ్ళెంపెట్టాడు యింటికి." చంద్రిపేరు వినేసరికి నాహృదయం స్తంభించి పోయింది – నోటమాట రాలేదు "ఇదెవరో చేసినపనే – పాత కసితీర్చుకోవడానికే ఎవరో కొంపలకునిప్పుబెట్టారు" అంటూ వాకమూలది నన్ను వొత్తిగిలమని ఆప్యాయంగా చంద్రిని వొడిలోలికి దీసుకుని జాగ్రత్తగా ఉపచర్య చేయడం ప్రారంభించింది. ఆ దీపపుకాంతిలో మాత్రం – రెండు నిముషాలు చంద్రిని చూడగలిగాను – అసలు చంద్రి ఇలానే వుంటుందా? లేక పొగ, మంట, శ్వాసకై ఆమెపడే త్రొక్కిడి పూర్తిగా స్వరూపాన్నే మార్చేసివుంటాయా? క్రమక్రమంగా జనం అధికమయ్యారు– ఇంక అక్కడ నిలువలేకపోయాను కొనఊపిరి కోసం పెనగులాడే ఆ ప్రాణిని చూస్తూ.

నడ యాడని కాళ్ళతో మెల్లగా దేహాన్ని బరువుగా యీడ్చుకుని యింటికి చేరాను. చంద్రి మీది అసూయ కొలదీ ఎవరో గ్రానుస్తులే భర్తలేని వేళగనిపెట్టి, వొంటరిగా వున్న చంద్రిని బాధింపడానికి బయటగొళ్ళెంపెట్టివుంటారు. నిద్రలోవుండి ఆమె దీన్ని గుర్తించలేకపోయింది. కలకాలం నుండి కరడుగట్టిన గ్రామీణ నిరంకుశత్వానికి, పల్లెటూరి పిచ్చి మూర్ఖత్వానికి బలి అయిపోయింది చంద్రి.

ప్రభాతం. ఎవరెలావున్నా గతులు తప్పరుగదా సూర్య చంద్రాదులు! మనకు ప్రియతములు ఈజగన్నాటకరంగంనుండి నిష్క్రమించినా మనదినచర్యలు మానుకోలేం. ఇలా అనుకోవడం ఒక బలహీనత. ఏదీతప్పదు గదా అని తృప్తిపడతాం కారణం లేనిదే, ఆమె కోరనిదే, నాఅంతట నేను కావాలని ఆమెను నాహృదయంలో ప్రతిష్ఠించుకున్నాను. ఉద్ధరించాలని గాలిలో మేడలు కట్టాను- అవి నేలపాలై, పిల్లలు మట్టిలో గట్టుకున్న పిచ్చిక గూడులై వూరుకున్నాయి. పట్టపగటి కటిక చీకటిలో ఆనీడలు అవుపించాయి. మిట్టమధ్యాహ్నంవేళ, మన మందరమూ చూస్తూండగా, రాజవీథిలో, మహాతల్లి మెడలోని ముత్యాలహారం మధ్య పొదుగబడ్డ మణిపూస మనకట్టెదుటనే జారిపోయింది. బిత్తర చూపులతో చుట్టూ చూస్తున్నాం. అంతే. 'ఏదీ? ఎక్కడా? ఎలాపోయిందీ?' అంటూ ఆరాటపడింది మానవహృదయం. అయినా దాన్ని మరువలేదు చపలత్వం!.

పది గంటలకు కతిపయకాండ పూర్తి గావించుకొని వచ్చాడు అప్పుడు ఇద్దరు స్నేహితులతో. వాడు యింకా మృగకోటిలోని వాడేగా! మావైపు చూస్తూనే బావురుమని ఏడ్వ నారంభించాడు. ప్రక్కవాళ్లను అడిగాను "చంద్రికి తెలివొచ్చిందిరా రాత్రి? పోయేటప్పుడేమన్నా చెప్పిందా?" ఇదొకభ్రమ, మనం పోయేటప్పుడు ఏదో చెప్పిపొయ్యేవాళ్ల వలె. "వచ్చిందండిబాబూ! కాని సంది పేలాపన - గిజగిజ తన్నుకుంటూ" అంటున్న వాళ్లకు అడ్డుతగిలాను. సంధిలో

మైనా సరే అల్లాంటి ఆడదానిమనస్సు తోణకదు. పైవాళ్లకు ప్రేలాపనవలె వుంటుందిగాని దాని అంతిమవాక్యంలో అర్థం వుండితీరాలి. "ఏమనేదేంటి?" ఆత్రుతతో ప్రశ్నించాను. "ఏదో మాలోకందొరా, 'లంకాపురినుండి కాపాడేరుబాబూ! నన్ను ఈ రాకాసుల్నించి రచ్చించలేరు బాబూ' అంటూ చాలాసేపు సణుక్కుంది" అన్నారువాళ్లు. ఈమాటలలో ఎంత సత్యంఉందీ! తీర్థంలో లంకాపురి గనుక ఆమెను ఆసుపత్రికి చేర్చడానికి నాకు వీలయింది. ఇక—ఈవూరు, ఈలోకం, ఈ మనుష్యులు—సాక్షాత్తు చంద్రికి లంకాపట్నమే. రాక్షసులే వీళ్లంతా. పెనిమిటిగూడా తన్ను అనుమానించాడని సీత అగ్నిప్రవేశం చేసింది.

"ఒరే—అప్పుడూ ! రాత్రి ఇంటితలుపుకు గొళ్లెం ఎవరు పెట్టారో తెలిసిందిరా ?" అడిగాను. వెక్కి వెక్కి ఏడుస్తూన్న వాడు, ఇంకా గోడుగోడుమంటూ తన పాపాన్ని ఒప్పకున్నాడు "నేనేదొరా" అని.

(సమాప్తం)

—ఆంధ్రపత్రిక సౌజన్యంతో

# పుత్రికా మేష్టి

వారివి భిన్నస్వరూపాలలోవున్న ఒకేఒక దివ్య ప్రవంతియొక్క శాఖలు. ఆయన శుద్ధ శ్రోత్రియవంశంలో జనించినా ఆధునిక విద్యాభ్యాసంలో ఆరితేరినవాడవడంవల్ల సంస్కార ప్రియుడువలెనే అగుపిస్తాడు. కాని మార్పు అనే దాన్ని వాడివడపోస్తేనేగాని అంగీకరించవద్దంటూ వుంటుంది, ఆతని హృదయం. బి. యే. ప్యాసైనాడు. ఉద్యోగ వాంఛ లేకుండా ఉన్న ముప్ఫై యెకరాల మాగాణీ స్థిరంచేసుకుని స్వగ్రామంలోనే వుంటూ కాలంగడుపుతున్నాడు. వ్యవహార క్రమంలో సిద్ధహస్తుడు.

శాస్త్రి జన్మతః సిద్ధించిన ప్రయోజకత్వంవల్ల గ్రామంలో మంచి పలుకుబడిని సంపాదించాడు. ఊళ్ళో దేనికైనా ఆతడు ప్రమాణం. యేతగువు తటస్థించినా, వాదోపవాదాలు వచ్చినా తుదినిర్ణయం శాస్త్రిదే. 'శంఖునబోసినగాని తీర్థంకాద'న్నట్లు, మంచి రసజ్ఞుడు. బాగా ఊహించి పిల్లని పడికట్టే తూచి స్కూలుఫైనలు ప్యాసైనదైనా లలితని వరించి ప్రేమించి పెళ్లి చేసుకున్నాడు.

లలిత చక్కగా చదువుకొన్నది. భర్తృహృదయాన్ని పూర్తిగా అవగాహన చేసుకుంది. కొద్ది విషయాలలో ఆతని ప్రవృత్తి ఆమెకు వింతగాతోచినా సర్దుకుపోయేగుణం. ఆధునిక నాగరిక ప్రపంచంలో పెరిగి పెద్దదైంది. నవభావాలూ, అభ్యుదయసాహిత్యం ఆమెను బాగుగా ఆకర్షించాయి. వాటి

నెంతగా ప్రేమించినా భర్త ప్రవర్తనకు ఆటంకంగా వుండ నంతవరకు మాత్రమే వాటిని పరిమితం చేసుకుంది. ఆమె హృదయం ప్రతిదాన్ని తార్కికంగా పరిష్కరింప గోరుతుంది. మాతృకకు ప్రమాదం రానంతవరకు సుగమంగావుండే మార్పును దేనైనా సంతోషంగా సమాజం స్వీకరించాలని ఆమె మనస్సు వాదిస్తుంది. హృదయంలో కళాభిరుచి వెలుగొందుతూంది. భావకవిత్వం, కథాకల్పన అంటే ఆమె చెవి గోసుకొంటుంది. సంసారచక్ర సంచలనానికి అడ్డురాకుండా యెప్పటికప్పుడు తన భావ ప్రసూనాల్ని వాడిపోకుండా నిత్య యౌవనంతో దీపింపజేస్తూ వుంటుంది. అలానే లలితంగా అదను దొరికినపుడు శాస్త్రి హృదయానికి నొప్పికలుగకుండా, అతనికి తెలీకుండానే అతనిలో మార్పు తేవడానికి ప్రయత్నిస్తూవుంటుంది ఆమె హృదయం.

లలిత పైకి నిర్మలంగా కనుపిస్తూ హృదయాంతరాళాల్లో అంతర్వాహినులీన్ని, నిత్యసంఘర్షణాలనీ గలిగివున్న మహాసాగరం. భర్తయొక్క ప్రవృత్తిని శల్యపరీక్షచేసి సహృదయంతో స్వీకరించి చెడుగును కడిగిపారెయ్యాలని చూస్తుంది. ఆతని నిత్య కర్మలూ, ధర్మాన్నిగూర్చిన ఆతని అభిప్రాయాలూ, తనకు క్షతిమించిన వనిపించే ఆతని విశ్వాసాలూ ఆమెను కలచివేస్తూ వుండేవి. ఒక్కొక్కప్పుడు మత విశ్వాసాలపట్ల శాస్త్రి ప్రకటించే గ్రుడ్డినమ్మకాలకు చిరునవ్వుతో బాహ్యాసుముఖత్వాన్ని వ్యక్తంచేసేది. ఆతడు ఆమంద హాసాన్నే ఆమె హృదయపూర్వక స్వాగతంగా స్వీకరించి

మురిసిపోయేవాడు—ఆతని అమాయికత్వం ఆమెను నిత్యం ఆందోళన పెడుతుండేది. దానివల్లనే ఆతనిపట్ల ఆమె ప్రేమ ద్విగుణీకృతం అవుతుంది. భర్తయెడ జాలి, ఆతనిలో యెప్పటి కేనా సంస్కారం తీసుకురావాలనే అభిలాష ఆమెను బలీయంగా ఆతని హృదయానికి హత్తించాయి.



# 2

శ్రావణమాసంలో ఒకనాటి సంధ్యవేళ – పల్లెపడుచులు ఊడుపునుంచి మళ్ళీ ఇళ్ళకు వస్తున్నారు. ప్రొద్దున్న తొమ్మిది గంటలనుంచీ సాయంత్రం ఆరుగంటలదాకా మడిలో నడుం వంచి పొలంలో ఊడ్చివచ్చి శాస్త్రిగారి యింటిముందు ఆగారు కూలికోసం. కొసరి కొసరి కూలి తగ్గించి యిస్తాడు శాస్త్రి. అనేక కారణాలవల్ల శాస్త్రిని వాళ్లు యేమీ అనలేరు. చదువొచ్చిన బహు కొద్దిమందిలోనూ శాస్త్రి ఆ వూళ్ళోనిధి. చిన్నపనికీ చితకపనికీ అసరాకు వస్తాడు ఆయన. ఊళ్ళో అందరికన్నా తక్కువ కూలి యిచ్చినా సంతృప్తితో వెళ్లిపోతారు వాళ్లు, కూలిపుచ్చుకొని గుసగుసల్తో వెళ్లుతూన్న వాళ్ళని లలిత పలకరించింది. వాళ్ళకు కూలి తక్కువైనా సంతోషంగా వెళ్ళడం ఆమెకు ఆశ్చర్యం కలిగించింది. విద్య, గౌరవం, పెద్దరికం పీటినెపంతో మోసగింపబడే అమాయిక ప్రజలను చూచి జాలిపడింది. కండలు పిండుకొని కష్టించినా కూలి కిట్టుబాటుకాదు వాళ్లకి. నోరెత్తి అడగలేరు

వాళ్లు. భర్త యిలాంటి అనేక సందర్భాలలో డబ్బు మిగిల్చి యేదేవతా ప్రీత్యర్థమో ఖర్చుపెట్టుతూంటాడు. న్యాయంగా కష్టించే నిరుపేదలను మాడ్చి ధర్మం పేరిట వంచించే అనేకులను మేపుతూన్న తనతోటి జనాన్ని చూచి ఆమె లోలోన అసహ్యించుకొనేది. ఇలానే ఊద్పులు, కోతలు, నూర్పిడులు యిత్యాది కార్యాలలో శాస్త్రి తన పొదుపరితనం ప్రకటించి తన ప్రయోజకత్వానికి తప్పకుండా మురిసి లలిత తన్ను మెచ్చుకుంటూ వుంటుందని తృప్తిపడతాడు.

మఱునాడు సాయంత్రం గ్రామంలోకి యెవరో పేరు వడసిన స్వాములవారు వేంచేశారు. అలాంటివాళ్ళు ముందుగానే శాస్త్రి పేరు విని ఆయన యింటికి వస్తారు. ధర్మంపట్ల ఆసక్తి చూపేవాళ్ళంటే చెవిగోసుకుంటాడు శాస్త్రి. స్వాములవారికి స్వాగతం పలికి యింటికి తీసుకువచ్చాడు. ఇంట్లో లలితతక్క తదితరులు లేరు. గృహగౌరవం నిలబెట్టడానికి స్వాములవారికి కావలసినవన్నీ ఆమెయే అమర్చవలసి వచ్చింది. హృదయంలో యిష్టం లేకపోయినా ఆమె ఆయనకు సేవచెయ్యడం తప్పిందిగాదు. శాస్త్రి భక్తిని స్వాములవారు వేనోళ్ళ కొనియాడారు.

రెండురోజులపాటు విడిదిచేశారు స్వాములు. ఊళ్ళో ఆబాలగోపాలం ఆయన పాదాలను శిరసున దాల్చి పూజ చేశారు. కోరికలను సిద్ధింపచేయుమని ఆయన్ని ప్రార్థించారు. ఈ తంతు అంతా చూచిన లలిత హృదయంలో శోకవంక

హాస్యమూ, మరొకవంక కరుణా వెల్లివిరిశాయి. ఊళ్లో మీసాలు మెలివేసిన పెద్దలు, కం ' '' బలిసినయువకులు అంతా ధర్మంపేరిట అవతరించిన ఆస్వామిని స్తోత్రం చేస్తుంటే ఆమె విస్తుపోతోంది. వారిలో శాస్త్రిపట్ట శిష్యుడు. స్వాములవారు వెళ్లిపోయేటపుడు శాస్త్రి ఆయనను తనకు పుత్రప్రాప్తి సిద్ధించే వరం ప్రసాదించమని ప్రాధేయపడ్డాడు. ఆయన మంత్రించి విభూతియిచ్చి లలితను మింగమనిచెప్ప మన్నాడు. వచ్చే వేసవిలో బ్రహ్మకపాలం సందర్శించి తీర్థయాత్రలు సేవిస్తే పుత్రసంతానం ప్రాప్తిస్తుందని శెలవిచ్చాడు. కాపరానికివచ్చి పదేళ్లయినా లలితకు కానుపులేదు. ఎన్నైవేలు కిమ్మతుచేసే తనస్థిరాస్తి యేమికాను? అని శాస్త్రి మనస్సులో యెక్కడ నుంచో బెంగ మొదలైంది. తారకమంత్రం వుపదేశించి స్వాములవారు వెళ్లిపోయారు. శాస్త్రి విభూతిని స్వీకరించమని లలితకు జరిగినదంతా విన్నవించాడు. లలిత లోలోన నవ్వుకొని విభూతి శాస్త్రిచూడకుండా గాలిలో ఉఫ్ఫున ఊదేసి ఊరుకుంది. మఱునాటినుండే ఉత్తరాది యాత్రకు సన్నాహాలు ప్రారంభించాడు శాస్త్రి. లలితమాత్రం తానురానని స్పష్టంగా చెప్పేసింది. మొదట్లో యిదిశాస్త్రికి నచ్చకపోయినా తర్వాత మనసు తిరగేసుకున్నాక అదిమేలే అనిపించింది. తనొక్కడూ అయితే సూక్ష్మంగా తేల్చుకురావచ్చు ననుకొని వేసవిలో బయలుదేరడానికి స్థిరపర్చుకున్నాడు.



# 3

కోతలూ, కుప్పనూర్పిడులూ అయిపోయాయి. ధాన్యం గాదుల్లోనింపి తాళాలు బిగించిసీలువేశాడుశాస్త్రి. క్రమంగా హేమంత శిశిర ఋతువులు గతించాయి. వసంతం ప్రవేశించి శాస్త్రి హృదయంలో నూతన వాంఛలను చిగురింపించింది. పెళ్లయి పదిసంవత్సరాలుపైదాటింది. స్వాములవారి ఆశీర్వచన ప్రభావంవల్ల పుత్రుడు కలుగుతాడని ఆతనిలోవిశ్వాసం ధృఢపడింది. శుభముహూర్తాన ఉత్తరాది యాత్రకు ప్రయాణంకట్టాడు. సంతోషంతో యాత్రలకు పంపించింది భర్తను లలిత. ఆతని ఊహలు తనకు పడకపోయినా కించిత్తయినా ఆతనికి నొప్పి కలిగేపని ఆమె యెన్నడు చేయదు. చేసినా ఆతనికి తెలియనివ్వదు. అట్టి ప్రవృత్తితో వాదోపవాదాలు నిష్ప్రయోజనం అని ఆదిలోనే ఆమె గ్రహించింది. ఆతని బలహీనతలను వేటినైనా గుర్తించినపుడు సానుభూతిని సహితం మందహాసంతో వ్యక్తం చేస్తుంది. భార్యను విడువలేక విడిచి ఎన్నో విషయాలపట్ల బహుజాగ్రత్త అని హెచ్చరిస్తూ శాస్త్రి బయలుదేరాడు. ఆతడు ఊరువిడచిన రెండుమూడు రోజులదాకా లలిత హృదయంలో అతన్నిగూర్చి అలాంటి వ్యక్తుల్నిగూర్చి యేవోభావాలు కల్రదొక్కుకున్నాయి. "ఆస్తిపాస్తులను చక్కదిద్దడంలో, ఆర్జనలో, ప్రజల్లో పలుకుబడి సంపాదించడంలో వీరుయెంత చతురిమను

చూపుతున్నారు. దమ్మిడీ దగ్గరనుంచి జాగ్రత్తగా లెక్క పెడతారు. కూలివాళ్లకు రోజుకూలి ఇవ్వడం లగాయతు తల క్రిందుగా లెక్కలు గుణిస్తారు. దావాలు కోర్టు వ్యవహారాలు యిత్యాదుల్లో యెంతటివాణ్ణయినా యిట్టే లొంగదీస్తారు. కొందరు యీబాపతువాళ్లే దార్జన్యాలు చేయించడంలో, ప్రజల ద్రవ్యం అపహరించడంలో మానవత్వాన్నే అవమాన పరిచే నీచస్థితికి దిగజారుతున్నారు. స్వార్థం విషయంలో దేశం ప్రజలూ అనే అభిమానమేనా లేకుండా ప్రవర్తిస్తారు. వీరిని, యింతటిప్రబలశక్తిసంపన్నుల్ని తమలోవుండే ఒక్కొక్క గుణం పశుతుల్యులనుగా, పందలనుగా, బానిసలనుగా మార్చి వేస్తూ ఉంటుంది. పస్త్రీలోలత్వమో; విషయలంపటత్వమో, మూఢవిశ్వాసాలో క్రుంగదీసి వీరివ్యక్తిత్వాన్ని నాశనం చేస్తూంటాయి. లేకపోతే నవీనయుగంలో జీవించే తన భర్త, విద్యాధికుడు ప్రజలకు మార్గం ప్రదర్శించవలసినవాడు, మత ధర్మాన్ని సంస్కరించ వలసినవ్యక్తి తానే మతమౌఢ్యంలో పడి తన్నుకొంటున్నాడే'' అని ఆమెమనస్సు ఆవేదనను పొందింది.

కాశీ, గయా, ప్రయాగా, హరిద్వారమూ సందర్శించాడు శాస్త్రి. పర్వతపరిసర ప్రాంతమవడంచేత వేసవి వున్నట్లేలేదు. జాగ్రత్తగా ఖర్చుపెట్టుకొంటూ చూడవలసిన స్థలాలన్నీ చూస్తూ యాత్రసాగిస్తున్నాడు. కనుపించిన గోసాయికల్లా మ్రొక్కుతూ సంతానప్రాప్తికి సలహాల నర్థించి సతమతమౌతున్నాడు. ఒక పుణ్యక్షేత్రం నుండి మరొక

క్షేత్రానికి వెళుతున్నకొద్దీ ఆతనికి పట్టుదల యెక్కువయింది. తన కోర్కెను తీర్చుకొనే సాధనం గ్రహించాలని పట్టుదల తీవ్రతరమయి మతధర్మ విషయాల్లో ఆతని వివేచనాశక్తిని గూడా దోచుకొంది.

తోడి యాత్రీకులతోనూ కొందరు సాధువులతోను మజిలీలుచేసుకుంటూ కాలినడకను బ్రహ్మకపాల క్షేత్రానికి ప్రయాణం చేస్తున్నాడు. హిమవత్పర్వతప్రాంతంలో అనేక మంది సన్యాసు లుంటారనీ, వారిలో విశేషశక్తి సంపన్నులూ, తపఃప్రభావం గల మహానుభావులూ వుంటారనీ చిన్నప్పటి నుంచి వినివున్న శాస్త్రి మజిలీలల్లో ఆయాసాధువులను సందర్శించి వారి ఆశీర్వాదాలు స్వీకరిస్తున్నాడు.

ఒకనాడు మధ్యాహ్నం మూడుగంటలకే చల్లబడిపోయింది. గంటసేపు గడిచేటప్పటికి చలి ప్రారంభ మయింది. ఒక ఆశ్రమంలో మజిలీ చేశాడు శాస్త్రి. సాయంత్రం పడగానే సాధువులు నెగళ్లు రగిల్చి మంటలు రాజేశారు. కూడా తెచ్చుకున్న పదార్థాలను తిని ప్రయాణీకులు నెగళ్ల చాయల మేనులు వాల్చారు. శాస్త్రికిమాత్రం నిద్రపట్టడంలేదు. ఎక్కడి గోదావరి మండలం! ఎక్కడి తుహినాద్రి! విధి తన్ను తీర్థయాత్రామిషతో యెంతదూరం తీసుకువచ్చింది? నిర్మలమైన వాతావరణం ఆతని గత జీవితాన్ని నెమరు వేతకు తెస్తోంది మనస్సులో. తనతల్లిదండ్రులకు తానొక్కడే కొడుకు. వారికి అతడే కర్త. వాళ్లు తన్నెంత గారాబంగా పెంచారు?

ఎన్ని ఆశలు తనపై పెట్టుకొని గతించారు ?". ఆతనిలో ఊహా సంఘర్షణ. అట్టి వంశధారా ప్రవంతి తనతో ఆగిపోవలసిందేనా. తనకసలు సంతానప్రాప్తి లేదేమో. మళ్ళీ మరో వూహా దైవజ్ఞ తుల్యులు స్వాములవారి ఆశీర్వచనం వమ్మవుతుందా. కాదు కాదు యెన్నటికీ గాదు. ధర్మం తలపుకువస్తే అతనిలో యెంత విశ్వాసం. తాను పూర్తిగా ధర్మాన్ని ఆశ్రయించాడు. జీవితంలో మఱొకదానికి దేనికీ ఉతడు తలవొగ్గలేదు భార్యయైనా తనతోపాటే వుంటాననటుందిగాని యెన్నడూ యెతికి ప్రతికి అనలేదే. ఆమె కిష్టంలేకపోయినా తనకోసం ప్రేమ పుర స్కృతంగా ఆమె యెన్ని త్యజించింది. చదువుకొన్నదైనా అదుపాజ్ఞల్లో యెలా మసలుతోంది. మఱి యింతటి చక్కని దాంపత్యంలో యీ కొఱత దేనికి. బహుశ భగవంతుడు సైతం తమ అనుకూల దాంపత్యం అంటే అసూయను ప్రకటిస్తున్నాడా?

ఇలా ఆలోచించే ఆతనినిశ్చలత్వాన్ని ఏదోశబ్దం భంగ పరచింది. చుట్టూ కలయచూశాడు. కటిక చీకటి అలుముకొని వుంది. అగ్నిదేవుడు మాత్రం శూన్యాకాశంలోకి నాలుకలు చాస్తున్నాడు. ఆ కొద్దిపాటి వెలుతురూ చీకటిని చీల్చడానికి విశ్వప్రయత్నం చేస్తోంది. మళ్ళీ శబ్దం నిశ్శబ్దాన్ని ఛేదించింది. ఆశ్రమంలో వెనుకప్రక్కన యెవరో దేన్నో కొడుతున్నట్లు గ్రహించాడు. ఈ నిశీధంలో ఆ శబ్దానికి కారణం? పరిసరాల్లో అందరూ గాఢనిద్రలో మునిగివున్నారు. నెమ్మదిగా లేచాడు శాస్త్రి. మెల్లగా అడుగులేసుకుంటూ వెనుకవైపుకు మళ్ళాడు.

కొంచెందూరాన నెగడి మండుతోంది. క్రీనీడను కొందరను గుర్తుపట్టగలుగుతున్నాడు. గెడ్డాలువారు సన్యాసులని చెబుతున్నాయి. ఇంత రాత్రివేళ యిక్కడ సన్యాసులు దేన్నికొడుతున్నారు. శాస్త్రి ఆలోచిస్తూ తనకు తెలియకుండానే పది గజాలు నడిచాడు.

అక్కడి దృశ్యం అతణ్ణి చకితుణ్ణిచేసింది. సన్యాసులు ఎవరినో వ్యక్తిని పడుకోబెట్టి రాళ్ళతో కొడుతున్నట్లు గుర్తుపట్టాడు. శాస్త్రికి వళ్లు జలదరించింది. కాళ్లు తడబడుతున్నాయి. సన్యాసులు హత్యాప్రయత్నంలో వున్నారా ? అయితే దానికి కారణం ? వారిచే దారుణంగా హత్యగావింపబడే ఆ నిర్భాగ్యు డెవడు ? ఆతని వూహకి దరీ అంతూ లేదు. క్రమంగా నెగడికి నాల్గుగజాల దూరంలో ఆగిపోయాడు.

"ఎవరూ?" ఎదుటనున్న సన్యాసులలో ఉన్నతాసనాసీను డొకడు ప్రశ్నించాడు. ఆతని కంఠంలో క్రౌర్యంగాని, రౌద్రంగాని లేవు. శాస్త్రి నెమ్మదిగా తన్ను తెలియపరుచుకున్నాడు. దగ్గరగా వెళ్ళి వణకుతూ నిల్చున్నాడు. ఒక సన్యాసిని వెల్లకిల పరుండబెట్టి శిరస్సుపై కొబ్బరికాయలతో కొడుతున్నారు. పడుకొన్న మనిషి శవప్రాయంగా వున్నాడు. అతడు హత్యగావింపబడ్డాడా ? లేకుంటే కించిత్తైనా బాధను వ్యక్తంచేయడూ తనపై అంతటి భీభత్సం జరుగుతూంటే. ఆతనికి యేమీ తోచలేదు.

సన్యాసులు తమ పనిలో లీనమయ్యారు. శాస్త్రి నెమ్మదిగా తన స్థలం చేరుకున్నాడు. ఆ సంఘటననుగూర్చి ఆలోచిస్తున్నాడు. సన్యాసులు సాత్వికులంటారేమరి ఇదేమిటి-మేధస్సు ప్రకృతినుంచి దూరమై శాస్త్రస్మృతి ప్రమాణాల వైపు మళ్ళుతోంది. రెండుమూడుసార్లు తనతో ముచ్చటిస్తూ యెవరో యోగులు చెప్పినట్లుతోచింది. సన్యాసులు నిర్యాణం పొందినపుడు యోగనిష్ఠలో వుండగా అగ్నియోగంవల్ల కపాలమోక్షం పొందుతారు. అలా పొందలేని సందర్భాలలో నారికేళ ఫలప్రయోగంవల్ల యితరులు కపాలమోక్షం సాధిస్తారు. మళ్ళీ లేచాడు శాస్త్రి. తన ఊహను స్థిరీకరించుకోవాలనుకున్నాడు. ఈమారు ఆతనికి ధైర్యం కలిగింది. సాహసంతో చరచరా సన్యాసులున్న స్థలానికి వెళ్లాడు.

ఉన్నతాసనాసీనుడైన సన్యాసిని తన సందేహంగూర్చి ప్రశ్నించాడు. అతడు శాస్త్రికిగల విజ్ఞానానికి సంతోషించాడు. "శాస్త్రిజీ! యీాయన వొక మహా యోగిపుంగవులు. ముప్ఫయి సంవత్సరాలనుంచి తపోనిష్ఠలోవుండి యోగసాధనలోనే నిర్యాణంపొందారు. మేమంతా యీాయన శిష్యులం. శిష్యధర్మ ప్రకారంగా మేం యీాయనకు అంత్యక్రియలు నెరవేరుస్తున్నాం" అన్నారు.

వారి నియమపాటవానికి శాస్త్రి హృదయపూర్వకంగా అంజలి ఘటించాడు. తిరిగి తనస్థానం చేరుకోడానికి బయలుదేరాడు. "యోగిపుంగవులు యెంతటి అదృష్టం! యోగ

ముద్రలో తపోసాధనలో ఆత్మ పరమాత్మలో లీనంచేసికొన్నాడు" శాస్త్రి భావం పరమార్థంనుంచి క్రమంగా లౌకిక ప్రవృత్తిలోకి దిగుతోంది. కొండలనుండి జారునొక కోమల శైవలిని— నాలుగేండ్ల క్రితం హిమవత్పర్వత ప్రాంతంలో తపస్సు చేసి తిరిగివచ్చిన వొక మహాసీయుడు చెప్పిన శాస్త్ర ప్రమాణం "అట్టి కపాలమోక్ష సమయంలో పగిలిన నారికేళ ఫలాఖండం భుజిస్తే వంధ్యత్వం నశించి గొడ్రాళ్ళు సైతం పుత్రులను కంటారు. ఇది శాస్త్ర సమ్మతం ఉద్ధృతమ్" ఆవాక్కు— ఆయన యెంత ధీమాతో చెప్పుకుపోయాడు? ఈ ఊహాతరంగం విజృంభించగానే ఆతనిలో విపరీతమైన ఆశ రేకెత్తింది. తన కళ్ళయెదుట పసిపాప ఉయ్యాలలో ఊగుతున్నట్లు, తన లలిత వడిలో తచ్చాడుతున్నట్లు తోచింది. వెనుకకు వెళ్లాడు.

పట్టశిష్యునికి తన అభీష్టం తెలియపరచాడు. ఆయన శాస్త్రి లౌకికత్వానికి నవ్వుకొన్నాడు. నారికేళఫలాఖండం యివ్వడానికి సమ్మతించాడు. కాని స్వామిని సమాధిచేయటానికి కొంత ద్రవ్యసహాయం చేయమన్నాడు. శాస్త్రిచెయ్యి క్రమంగా జేబులోకి ప్రాకింది. చీకటిలో మంటలకాంతిలో మెరస్తున్నాయి పచ్చకాగితాలు. ఒకటి, రెండు, మూడు, నాలుగు ఐదూ కొద్దిపాటి కాగితాల జరబుర ఆగిపోయింది. రెండు టెంకాయచిప్పలు శవరక్తసిక్తమైనవి ప్రసాదించారు సన్యాసులు శాస్త్రికి. చీకటిలో కనలేని యెనలేని ఆతని ఆనంద సాగరం తరంగాలతో పెల్లుబికింది. సన్యాసికి నమస్కరించి

స్నిష్క్రమించాడు. కటిక-చీకటి యీ దృశ్యాన్ని చూసి ముసి ముసి నవ్వులతో ముఖం చాటుచేసుకుంది. వెనకకుతిరిగి నడుస్తున్న శాస్త్రిని సన్యాసులు కొందరు జాలిగా, కొందరు దీనంగా, కొందరు ఆశ్చర్యంతో చూస్తూ సాగనంపారు. ప్రత్యూషంకు స్వాగతం పలుకుతూ నిశాంగనకు నిష్క్రమణం ప్రసాదిస్తూన్న ఆ సంధిఘడియల్లో హిమవంతం శాస్త్రిని జో కొట్టి నిద్రపుచ్చింది. ధర్మాసక్తిపరులచే తమ కార్యసాధన పట్ల విజయం సాధించాం అని జనించిన భ్రమగల సమయం లో వుదయించే ఆనందం వర్ణనాతీతం.

మనస్సుకి యేదైనా భావం స్థిరత్వం పొందినట్లగుపిస్తే కార్యతీవ్రత హెచ్చుతుంది. అప్పటి ఆనందం మనుష్యుల్లో ఉద్వేగాన్ని హెచ్చించి కార్యదీక్షను ద్విగుణీకృతం చేస్తుంది. మజునాడుదయాన్నే శాస్త్రి ప్రయాణంకట్టి బ్రహ్మకపాల యాత్ర సుఖప్రదంగా ముగించాడు. ఏకాయెకిని గృహాభి ముఖుడయ్యాడు. హిమశైలంనుండి దిగజారే గంగాస్రవంతి వలె సంతోషంతో తూలిపడుతూన్న హృదయంతో యిల్లు చేరుకున్నాడు. అనుకున్న సమయంకంటే త్వరగా వేంచేసిన భర్తను అప్పటి ఆతని ముఖకవళికలను చూచిన లలిత యేదో విశేషం వుండితీరాలని యిట్టేపసికట్టేసింది. ఇంతటి తీర్థ యాత్రలో యెంతటి మహత్తర అనుభవాన్నైనా శాస్త్రి సంపాదించివుంటాడనీ తనమనసుకుగూడా ఆ అనుభూతి వేయి విధాల పనికల్పిస్తుందని ఆమెఆనందంపొందింది. భార్యాభర్తలు ఒకరి నొకరిని చూసుకున్న తొలిక్షణం- ఆక్షణం ఒక పవిత్ర

ముహూర్తం- గంగానది సాగర సంగమసమయంలో యెలా వుంటుంది? ఆ దివ్యస్రవంతికే నారీత్వంసిద్ధిస్తే క్షణకాలం ఆ దృశ్యాన్నితిలకిస్తే అట్టిక్షణాలు మానవజీవితం యావత్తులోను ఒకటోరెండో వుంటాయనిపిస్తుంది. ఆ చూపు ఆగామియైన మనోజ్ఞ మానవజీవితానికి నాందీగీతం. శాస్త్రిపొందిన ఆనందం లలితకు యింకా తేలీదు. లలితప్రకటించే హర్షం శాస్త్రికి అర్థంగాదు. సూచనలు ఆమె యెన్నివిధాల ప్రకటించినా ఆ క్షణంలో శాస్త్రి అవి అవగాహనచేసుకోలేదు. కారణం అతడు దానికై ప్రయత్నించనే లేదు.

శుభతిథిని సమారాధన జరిగింది. శాస్త్రి వివాహానికి తర్వాత ఒకదశ దాటినాక మళ్ళీ బీదసాదల విస్తళ్ళులేచాయి వారి యింటిముంగిట వేయబడ్డ కమ్మని వాసనలజిమ్మే క్రొత్తతాటియాకులపందిరిక్రింద. అసలు పేదలకుపెట్టినదే పెట్టు. వాళ్ళనోళ్ళ వెంబడినే వర్థిల్లాలి దాతృత్వసంస్తుతి. "ఈసారి కొడుకుబుడితే మళ్ళీ పప్పుకూడు" అని యెగతాళిచేశారు ఒకనాడు తమవైపు జాలిగాచూసిన లలితను పల్లెపడుచులు. వాళ్ళ అమాయకత్వం- ఆ చీకటిని చీల్చుకొని ఆ జీవాలు బయటపడడానికి యింకాకొన్ని యుగాలుపట్టాలి. చూసి ముసిముసినవ్వులు పువ్వులుగా ముడుచుకుంది లలిత ముద్దులొలికే పెదవులపై. ఊరూ వాడా శాస్త్రిగారి తీర్థయాత్ర కొన్నాళ్ళదాకా చర్చనీయాంశమైపోయింది. దీనితో శాస్త్రిగారి [illegible]నికి మహాముఖాళ్ళు పడ్డాయి.

రోజుకొక్కటి చొప్పున వివిధ పుణ్యస్థలాలనుంచి తెచ్చిన ప్రసాదాలు రుచిచూపించాడు శాస్త్రి లలితకి. ఒక్కొక్క ప్రసాదం వెనుక ఒక్కొక్క క్షేత్రం దాన్ని ఆనుకొని వొకవొయ్యారమొలికించే కథ. ఆకథచివర ముత్యాలకోవలో మెరిసే కొలికి పూసలా మిరుమిట్లుగొలిపే పావిత్ర్యం. జరగడంమాట అటుంచి యిట్టివి సంకల్పించిన మహాపురుషునికి చేమొత్తి నమస్కరించాలి. ఇలాగ ఏకాదశిదాకా గడిచింది.

ఏకాదశినాడు ఉదయాన్నే లేచి లలితను స్నానంచేయమని దేవునిగదిలోకి పిలిచి నెమ్మదిగా తాను భద్రపరచిన టెంకాయచిప్పలను తీశాడు, శాస్త్రి. వాటి ప్రాశస్త్యాన్ని ఘనంగా వర్ణించాడు. నాడు వుపవాసముండి వాటిని సేవించమన్నాడు. పుత్రసంతానప్రాప్తి తథ్యం అని వాక్రుచ్చాడు. లలితకి యిది మరోసమస్యగా పరిణమించింది. ఆమె దీన్ని స్వీకరించడమా, మానడమా? రక్తసిక్తమై, మలినమై, దుర్గంధ యుతమై బూజుపట్టియున్న కొబ్బరికాయముక్కలు తన కో భవిష్యత్తును ప్రసాదిస్తున్నాయా? ఆమె నమ్మలేకపోయింది. ఇంతటి అమూల్య ఔషధాన్ని భర్త యెవరిదగ్గర యెలా తెచ్చాడు? ఆతడు ఆవుదంతం చెప్పనైనాలేదే-చెబితే భర్తకు తెలీకుండానైనా తాను వంధ్యపీడిత సోదరీలోకానికి సవివరంగా చిరునామావ్రాసి పంపించి పుణ్యంకట్టుకునేదే. చాలావిషయాల్లో తన మనస్సుకు నచ్చకపోయినా భర్తకోసం తన మనస్సును వంచించి ఆమె తపనపడ్డది. ఈ సాయంత్రం ఆమె హృదయం దాని కెంతమాత్రం అంగీకరించలేదు. తలమొత్తి

గదినంతా కలయచూసింది. భర్త బయటకు వెళ్లి యెంతసేప యిందో వెళ్ళి ఆయన్ను ఈభోగట్టా అడిగేస్తే శాస్త్రి బాధ పడతాడేమో. లేకపోతే కథల్లో చెప్పినట్లు ఆవివరాలు బయలుపరచిన వాళ్ళు తలబ్రద్దలయ్యో, లేక శిలావిగ్రహా లయ్యో నశించిపోతారని చెప్పుకొని ఆ వృదంత కథానికను శాశ్వతంగా తాళంవేసి కప్పెట్టేశారేమో. ఆలోచించినకొద్దీ ఆమెకు దుఃఖం ఆగడంలేదు. ఆమెదృష్టిలో భర్తవొక్కడూ వొక సమస్య. అట్లాంటివాళ్ళే సమాజంలోవున్న వేలాది ప్రజల భవితవ్యం ఒకసమస్య. ఇలాంటివాళ్ళచే కల్మషమైన ధర్మాన్ని అపార్థంచేసుకోబడ్డ మతాన్ని యితరులు తృణీక రించారంటే ఆశ్చర్యం యేముంది?

పైటకొంగుతో కళ్ళుతుడుచుకొంది. చేతులుజోడించి శాస్త్రి తనకిచ్చిన ప్రసాదాన్ని వంటయింటి పొయ్యిలో ప్రజ్వరిల్లుతున్న అగ్నిదేవుడికి అర్పించింది. ఆ కొబ్బరిచిప్పలు రెండు అగ్నిలోబడి దగ్ధమైపోయాయి. సంతానం పొందుపరుప బడ్డ దివ్యౌషధం అని తనభర్త భ్రమపడ్డ వస్తువు తార్కిక వాదంతో క్షణంలో బూడిదయ్యింది. ఇకముందునుంచి మన స్సును వంచించుకొని కేవలం ఇతరులకోసమై తాను విశ్వ సించని మూఢ నమ్మకాలను గ్రుడ్డిగా పాటించగూడదని స్థిరపరచుకొంది.

ఆవాళరాత్రిదాకా. శాస్త్రి లలితను కలుసుకోవడం సంభవించలేదు. ఇంట్లో పనులన్నీ పూర్తిచేసుకొని పడక గదిలోకి వెళ్లేసరికి శాస్త్రి ఏదో ఆలోచిస్తూ మంచంపై

కూర్చున్నాడు. అనేక సందర్భాలలో శాస్త్రి చదువుకొన్న వాడవడంవల్ల చదువుకొన్న భార్యకు చాలా సంగతులు నర్మగర్భంగా చెబుతూ వుండేవాడు. ప్రసాదం లలిత సేవించియే వుంటుందని ఆతని పూర్తి నమ్మిక. ఎన్నడూ తాను కని విని యెఱుగని ఆనందాన్నీ తృప్తినీ శాస్త్రి పొందుతున్నట్లు లలిత గ్రహించింది. ఆచీకటిలో ఆతన్ని చూస్తున్న కొద్దీ లలితకు ఆశ్చర్యం అధికమయింది. తనవ్యూహాల్ని తన మనస్సును తన హృదయాన్ని ఆనాడు తన సర్వస్వాన్నీ ఆక్రమించి ఆవహించి వున్నాడు. పుష్కలంగా పొలం ఫలించిన నాడుగానీ, వ్యవహారం తనపక్షం అయినప్పుడుగానీ, లాభసాటు బేరాలు సిద్ధించినపుడుగానీ, కనీసం స్వాములవార్లు మఖాశీర్వచనాలు ప్రసాదించిన నాడైనా అంతటి ప్రశాంతత ఆతని నిద్రలో ఆమె చూడలేదు. దిగంబరత్వంలో వున్న శాస్త్రి హృదయంలో గాఢాంధకారంలో దేదీప్యమానంగా దీపించే జ్యోతిర్గోళంవలె నాడు ప్రకాశించే శుద్ధ మూఢ విశ్వాసాన్ని లలిత స్పష్టంగా చూడగల్గుతోంది. యెంత చదువుకుంటే నేం ప్రయోజనం? ఎంత ప్రభావం గలిగివున్నా లాభం? విద్యా వాతావరణం ప్రయోజకత్వం ఆతని సర్వశక్తులూ ఆమె హృదయం ముంగిట దాసులైనాయి. అబల యనుకోన బడ్డ లలిత ఇక్కడ సబల. శాస్త్రి గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు. లలిత పకపక నవ్వుతోంది. శాస్త్రిని చూసి కాదు. నేటి తన సమాజంలో వేళ్లుపాతుకుపోయిన కుళ్లునుచూసి. ఆ కుళ్లును శక్తిక్రిందా, ఆడబ్బును బలంక్రిందా తాను వూహిం

చడమే। గాక యితరుల్ని దీనుల్ని, హీనుల్ని, అమాయకుల్ని దాన్నే పటిష్ఠత క్రింద, ప్రభావం క్రింద వూహించేటట్లు చేసి పవిత్రమైన ధర్మాన్ని అవమానపరచడం చూసి- యోచించిన కొద్దీ ఆమెలో సంఘర్షణ చెలరేగింది. "తాను ధర్మాన్ని విశ్వసించింది. ధర్మం ఘనతరమైనదే, పవిత్రమైనదే. కాని దానికి అధిపతులం, ఆరాధకులం, నిర్వాహకులం అని పేరెట్టుకొన్న వేరి నడతలవల్ల యేవిధంగా ఆధర్మం పతనమైపోతోంది? ఇలాంటి యుగంలో తనలాంటివాళ్ళు ఎలాగ బ్రతకడం- ఎదురీదడానికా శక్తి చాలదు. ఆ కల్మషంలోబడి కొట్టుకుపోవడానికి మనసుకిట్టదు- తనలాంటి వేలాది హృదయాల్లో బహిర్గతం గాకుండా తాళం బడ్డభావాలకు తరుణోపాయం యెక్కడ? ఇలాంటి భర్తతో జీవితం సాగించితె తన ఆశయాలకు యిక తిలాంజలి అన్నమాటేనా? ఏదైనా మోక్షసాధనంవుందా?" రెండుమూడు రోజులవరకు లలితకు ఇవే వూహాలు. ఆమెకు కంట కునుకులేదు. తిన్నతిండి వంటబట్టడంలేదు.

శాస్త్రికిమాత్రం మఱునాటినుంచీ యేదో మహత్తర విజయం సాధించినట్లుంది. లోలోన తనభార్యను పరిహాసించేరోజు అచిరకాలంలోనే వస్తోందని యీ అనుభూతితో లలితలో దాగి దాగుడుమూత లాడుతున్న సందేహాలు పటాపంచలు కాక మానవని గర్వించాడు. ఆమె యెప్పుడూ తనతో వాదించకపోయినా ఆమెప్రవృత్తిని అనేకసార్లు పసికట్టి అనుమానించడం ప్రారంభించాడు లోగడ. దీనితో తన విజయయాత్ర పూర్తి అయినట్లే. అన్నింటికన్న

అతని ఆనందాన్ని అధికం చేసింది- తన ఆస్తికి ఒక పుత్ర వారసుడు, తనకు వంశోద్ధారకుడు, కర్త జనించబోతున్నాడు అన్న ఆశ. అతనితో గృహంలో ఒక నూతనశకం ప్రారంభిస్తుంది. తానింక హాయిగా నిశ్చింతతో కాలం వెళ్ళబుచ్చవచ్చు. శాస్త్రిలోని ఈసంకల్ప వికల్పాలను ఒకవంక కనిబెడుతూ వుంది లలిత.



# 6

శాస్త్రి ఉత్తరాదినుంచి వచ్చాక ఆనాడే లలితకు సుఖంగా నిద్రపట్టిన రోజు. రెండుమూడు రోజులుగా ఆమెలో భీభత్సాన్ని రేకొల్పిన తుఫాను మందగించింది. ప్రశాంత సాగరంలా ఆమె హృదయం విలసిల్లింది. నాటిరాత్రి ఆమె కొక మధుర స్వప్నం వచ్చింది. లలితకు జీవితంలో యెన్నడూ అట్టికల రాలేదు. కల ప్రారంభంలో ఆమెను కలచివైచినా అంతంలో బలీయమైన ఆశాపాశాన్ని ఆమెలో పాదుకొల్పింది.

"లలిత మనోజ్ఞమైన ఉద్యాన వనంలో విహరిస్తూ ఆమెకు తెలియకుండానే వనాలను అధిగమించి గహనాంతర సీమకు చేరుకుంది. జీవితంలో ప్రప్రథమంగా ప్రకృతిదేవత నగ్నస్వరూపాన్ని సందర్శించింది. ఆనందపూరితహృదయంతో

విహరిస్తున్న ఆమెను ఒక దృశ్యం చకితపరచింది. ఒక వటవృక్షంక్రింద నీడకోసం విశ్రమించిన లలితయెదుట యెవరో తపస్వి సాక్షాత్కరించాడు. ఆతని బవిరిగడ్డం, కమండలం, మెడలో రుద్రాక్షమాలా, సిద్ధుడనీ, సన్యాసియనీ అతన్ని పరిచయం చేస్తున్నాయి. వణుకుతున్న శరీరంతో లలిత ఆయతికి నమస్కరించింది. అప్రయత్నంగా ఆ మునీశ్వరుని పెదిమలు కదిలాయి. విపినాంతర్భాగంలో విస్తరించివున్న నిశ్శబ్దం భేదింపబడింది. "సుపుత్రప్రాప్తిరస్తు" అన్న వచనాలు లలితను ఊపివేశాయి. అమితమైనభయం ఆమెను ఆవహించింది. నోట మాటలేదు. క్షణంపాటు అతడు ఆమె మనోవేదనను గుర్తించినట్లుగా మందహాసం చేశాడు. యతీశ్వరుని ఆశీర్వచనం ఆమెను కలచివేస్తూంది. అది నిజమైతే, తనగతి యేమికాను? తనలో పొందుపరచుకున్న తర్కం తగలబడి పోకుండా నిలవగలదా? "యీ కాలంలో ప్రజలు ప్రత్యక్ష ప్రమాణం కోరుతారుగానీ సిద్ధాంతాన్ని విశ్వసించరు. ప్రతి దానికీ దాఖలా కావాలంటారువాళ్లు." భర్త తన్ను పరిహాసిస్తున్నట్లుంది కళ్లెదుట.

"ఏమమ్మా? అలా ఆలోచిస్తూ నిలబడిపోయావ్? సుక్షేత్రమైన గృహ స్వర్గసీమను విడిచి యిలా అడవులబడి పోతున్నావే? నీకు యింతటి విరక్తికి కారణం?" సన్యాసి గడ్డం నిమురుకొంటూ ప్రశ్నించాడు. లలిత బెదురుచూపులతో తల యెత్తింది. "అయ్యా! నా హృదయం రెండు వాదాలమధ్య ఇతమిద్ధం తేల్చుకోలేక నలిగిపోతోంది. పవిత్రమైన ధర్మా

నికి కీడు తెచ్చే ఆచారాలు, పరిశుద్ధమైన దివ్య సంస్కృతిని మైలపరచే మూఢ నమ్మకాలు వీటిని త్రెంచి ధర్మానికి స్వచ్ఛమైన ఆకృతిని కూర్చాలని నా మనస్సు ఆతుర పడుతోంది. తెలిసుండి నావంటిదాన్ని ఆత్మ వంచనతో యెన్నాళ్ళు జీవితం వెళ్ళబుచ్చగలను? విధికూడా యీ వెర్రితల వేస్తున్న వితండవాదాన్ని సమర్థిస్తున్నాడు. ధర్మాన్ని నిజస్వరూపంలో చూపించాలని ఉబలాట పడుతున్న యీ అబలహృదయం యీ యుగంలో విజయం సాధించగలదా?" తడబడుతున్న గొంతుకతో యింక మాట్లాడ లేకపోయింది. "అమ్మా నీదే అంతిమ విజయం. నీబోటి యువతీ యువకుల చేతుల్లోనే భారతీయ సంస్కృతికి భవిష్యత్తు ఇమిడివుంది. పట్టుదలతో కృషి చేసి మీరే విజయం సాధించగలరు. దీన్నిగురించి నీకు తార్కాణాలతో తెలియచెప్పడానికే నేను ఇక్కడకు వచ్చాను." అంటున్న యతీశ్వరుని పలుకులు లలితలో సంభ్రమాన్ని నెలకొల్పాయి.

"లలితా! నీవు యుక్తియుక్తంగానే చేశావు. మొన్న ఆనారికేళ ఫలఖండాల్ని అగ్నికి, ఆహుతిచేయడం, అట్టివ్యూహాను జనియింపజేసిన సాహసాన్ని పొందడంలో నీహృదయం ప్రశంసనీయ మైంది. నేనొక సన్యాసిని. యుక్తవయస్సులో అనేక పాపాలు చేశాను. ఆ పాపాలకు ఫలితం ఈజన్మలోనే అనుభవించాను. తుదకు నాసమాజంలో జరుగుతున్న అత్యాచారాలను సహించలేక విరక్తిగలిగి సన్యసించాను. హిమవత్పర్వత ప్రాంతంలో తపస్సు ప్రారంభించిన నాకు అక్కడా

యీబాధలు తప్పలేదు. శిష్యులు వారిలో అహంకృతి వారిని సవరించడానికి నేనుపడ్డ వ్యధ ఇలా తపోక్రమం ముప్ఫయ్యేళ్ళ దాకా సాగింది. నాశిష్యులంతా నేనేదో పరిపక్వం పొందిన సన్యాసినని దైవతుల్యంగా నన్ను పూజించారు. నా నిర్యాణ సందర్భంలో జరిగిన తతంగం మూఢనమ్మకాలకు బలియైన నీభర్త చూడడం తటస్థించింది. ఇంకేముంది? నాశిష్యులను ప్రాధేయపడి అయిదువందల రూపాయలిచ్చి నిన్నుగ్రమింగమని బలవంతపెట్టిన ఆప్రసాదం కొనుక్కున్నాడు. విద్యవుండీకూడా మృగత్వం విజృంభించింది. సన్యాసంలోవున్న వ్యక్తులకు కూడా కాంక్ష పోలేదు. అభ్యుదయగాములు కావలసిన ప్రజలు అధోగతికి దిగజారారు." లలిత వింటూ విస్మయపడుతోంది.

"అయితే- మీకు నావల్లకావలసిన ప్రయోజనం?" ప్రశ్నించింది. "అమ్మా యెంతేనావుంది. నాకోరిక నెరవేరుస్తానని వాగ్దానంచెయ్యి" అని చేయి చాచాడు. బరువెక్కిన హృదయంతో "అబలనైనా యథాశక్తి ప్రయత్నించి తమ ఆత్మకు శాంతిని చేకూరుస్తాను" అంటూ ఆమె యతిచేతిలో తనచేతి నుంచింది. "లలితా! నీవింకా కొన్నినాళ్ళపాటు నీ హృదయంలోని భావాలను వాడిపోకుండా ప్రజ్వలింప జేసుకోవాలి. ఈసమయంలోనే సమాజం నిన్ను ప్రతిఘటిస్తుంది; హేళనచేస్తుంది; నిందిస్తుంది. నిన్ను నాశనం చేయాలనికూడా చూస్తుంది. వారి నీచకర్మకాండను ఖండింప చూసే నీ భావ ప్రసూనాల్ని నలిపివేయ చూస్తుంది నిర్దయగా. అయినా- నీ కొకటే ఆత్మవిశ్వాసం- పవిత్ర ఆర్యధర్మాన్ని సంరక్షించడా

నికి మళ్ళీవొక యుగకర్త నీగర్భాన జనించుతాడు. ధర్మం పేరిట నిర్మించే కల్మషాన్ని ధైర్యంగా ప్రక్షాళనచేసి దివ్యసంస్కృతిని మళ్ళీ వొకసారి జగత్తులో వెలయింపజేస్తాడు. భారతమాత ప్రతిభకు తిరిగి ప్రపంచం మోకరిల్లుతుంది. కాని యీ అవతారఘట్టం సంభవించేలోపున- ధర్మరక్షకులం అంటూ అవతరించే కపటస్వాములు; సన్యాసులం అంటూ విరవీగే సన్యాసులు; కర్మకాండలకు అధికారులం అని డంబాలుకొట్టే కలుషాత్ములు, వేలు, లక్షలుగావున్న సోదర అమాయకుల్ని పీడించుకొని తినే దారుణకృత్యాల్ని చూడవలసి వస్తుంది- యీ వాతావరణం ప్రతి ప్రగతి హృదయంలోనూ నైరాశ్యతను తాండవింప చేస్తుంది. ఇదే అదనుగా స్వీకరించి భౌతికశక్తులు వెర్రితలలేస్తాయి. సాక్షాత్తు ఆర్యధర్మాన్నే కాలదన్నే శక్తులు విజృంభిస్తాయి. మహత్తర విజయోత్పూర్వం సాగరంలో పెనుతుఫాను అనంతరం విలసిల్లే ప్రశాంతతకు ముందు- భక్తులకు భగవంతుడు సాక్షాత్కరించే ముందువలె కొంత ప్రళయతాండవం తప్పదు- నీకర్తవ్యంమాత్రం వొక్కటే... యెడతెగని ప్రతీక్షతో, విశ్వప్రయత్నంతో మూఢ నమ్మకాలకోసం మొహంవాచి తమ పవిత్ర సౌశీల్యాన్ని సహితం భంగంచేసుకొనే సోదరీమణుల్ని, వృథాప్రయాసలుపొంది పువ్వులాంటి శరీరాన్ని ఉపవాసాలతో, ప్రదక్షిణాలతో, స్నానాదులతో శుష్కింపచేసుకొనే కన్నెపడుచులు వీరిని తరింపచేయడానికి పాటుబడాలి- భరతమాతకు భాగ్యవిధాతయైన ధార్మిక విప్లవకారుడు ఉదయించేవరకు సమాజ రక్షణభారం నీవు వహిం

చాలి. అబలవని ఆత్మవిశ్వాసాన్ని సడలించుకోకు- స్త్రీ సాహసికురాలు. పరాశక్తి నీలో ప్రసవ వేదనను పొందుతోంది. ప్రయత్నించు. నీకసాధ్యం లోకంలో ఏదీలేదు." సన్యాసి యిలామాట్లాడుతూనే అంతర్ధానమయ్యాడు. లలిత యింకా అలా చేతులుజోడించి నిలబడే వుంది. యతీశ్వరుని సందేశం వినడంతోనే ఆమెలో వేవిధాలా ఆశ రగుల్కొంది. భర్తపై తన విజయం తథ్యమనుకొంది. తన భావస్రవంతి బహునిర్మలమైంది. పవిత్రమైంది- స్ఫూర్తిదాయకమైంది. ఒక మహాశక్తి నాటి నుండి తనలో పెంపొందుతుంది. అట్టి యుగ పరివర్తనను తాను అచిరకాలంలో ప్రసవించబోతోంది. యుగాధార పురుషుని పెంచి పెద్దచేసే సౌభాగ్యం తనకు లభిస్తుంది. ఈ సంఘటనతో లలితనుంచి అబలత్వం అదృశ్యమైంది.



## 7

శాస్త్రి లలితలో యెంతో పరివర్తనను చూస్తున్నాడు. క్రమంగా ఆమెగూడా తనతో యేకీభవిస్తున్నట్లు ఆమెయందు గోచరించేలక్షణాలను గమనించిన ఆతనిహృదయంలో ఆనందం అతిశయించింది. నెలలు—రోజులుగా గతిస్తున్నాయి. భార్యాభర్తల హృదయాలు రెండూ సంతోషంగానే వున్నాయి. ఆతనిఆనందంసంగతి ఆమెకు తెలుసు. కాని ఆమె సంతోషంతో

అంతర్వాహినిగావున్న నగ్నసత్యం అతనికి తెలియదు. శుభముహూర్తాన లలిత తేజోవంతుడైన పుత్రుణ్ణి ప్రసవించింది. శాస్త్రి తనకు అమూల్య ఔషధాన్ని ప్రసాదించిన సన్యాసుల్ని స్తుతించుకొన్నాడు మనస్సులో. ఆ యింటికే గాక ఆవూరికే పెద్ద పండుగయింది శిశుజననం. శాస్త్రి తన ప్రభావాన్ని గురించీ, తన విశ్వాసాన్ని గురించీ, లలితకు చెప్పడం అనవసరంఅనుకొన్నాడు. ప్రత్యక్షనిదర్శనంవుండగా యింక వ్యాఖ్యానం యెందుకూ? అంటుంది అతనిమనస్సు. లలిత దీన్ని పరిశీలిస్తున్న కొద్దీ అధికంగా ప్రకటిస్తున్న ఆనందం శాస్త్రికి కొంచెం ఆశ్చర్యాన్ని కలిగించింది. కొందరు తమ ఓటమిని విచారంతో గాకుండా మందహాసంతో స్వీకరిస్తారు అని సమర్పించింది అతని హృదయం. అంతిమ విజయం తనదే అయినందుకు అతనిగర్వం అతిశయించింది. వాళ్ళయింట్లో మళ్ళీ సంతర్పణలు సమారాధనలు జరిగాయి. నౌఖర్లకు, చాకళ్లకు బహుమతులు, పురోహితులకు పారితోషికాలు లభించాయి. తనకు తెలీకుండానే విపరీతంగా ఖర్చుజరిగినా విస్తుపోలేదు శాస్త్రి. తనజీవితంలో ఒక మహత్తర విషయాన్ని సాధించాడు. అదే అతని ధీమా.

బారసాల మహావైభవముగా ముగిసింది. చుట్టాలు, పక్కాలు యెవరితావులకు వారు వెళ్ళిపోయారు. లలిత పుట్టింటివారు లలితపొందిన మహాభాగ్యానికి మురిసిపోయారు. ఆమె సహజ ప్రవృత్తితో పరిచయం గలవాళ్లు కొంత ఆశ్చర్యం పొందకపోలేదు. మళ్ళీ ఆయింటిలో నిర్మలమైన ప్రశాంత

వాతావరణం తాండవించింది. యేమూల చూచినా సంతోషమే వ్యాపించివుంది.

ఒకనాడు శాస్త్రి పొలంనుంచి యింటికి వచ్చాడు. లోపల అడుగుపెడుతూనే లలిత పాపను ముద్దులాడుతూ తనలోతానే అనుకొనేమాటలు ముద్దుగా అలానే వింటూ ఆమె 'ఆనందానికి అడ్డుతగులగూడదని తలుపు వారనుంచుని ఉన్నాడు. లలిత పాపాయిని ఉద్దేశించి అంటున్న మాటల్లో కొన్ని అతన్ని నిశ్చేష్టుణ్ణి చేస్తున్నాయి. "భాస్కరం - మా బాబుగారి బండారాన్ని నీవేబయటపెట్టాలి. అయిదువందల రూపాయలు ఖర్చుపెట్టి నిన్ను కొనుక్కొందామని ఆశపడ్డ మీనాన్నగారి నెలాగైనా ఆడిస్తావుగా నువ్వు," శాస్త్రికి నిరుత్తరతవల్ల లలిత యింకా అనేమాటలేవీ వినపడడంలేదు. ఈ యింద్రజాలంలో యిరుక్కున్న చిదంబర రహస్యం తాను ఊహాప్రపంచంలో యేండ్లతరబడి కృషిచేసి నిర్మించుకొన్న దుర్భేద్యమైన కోటగోడల్ని తునాతునకలు చేస్తుంటే ఆతని హృదయం తూలిపోతుంది....

